# రతితత్త్వ మీమాంస



గ్రంథకర్త:

శ్రీ స్వామి

నారాయణానంద సరస్వతి మణిలాల్

నారసింహక్షేత్రం.— కోరుకొండ.



1959

వెల: **2.8.0**

శ్రీ సద్గురువులు, పూజ్యులు నగు

**శ్రీ స్వామి అఖండానంద జీ మహారాజ్**

నాసిక్ - పంచవటిక్షేత్రం, కైలాసమఠ్

వారికి భక్తిపురస్సరముగా అంకితము.



శ్రీ రాజా రాఘుపరాజు ఎర్రంరాజు బహద్దూర్ వారు

నూగూరు ఎస్టేటు

వెంకటాపురం, పోస్టు: భద్రాచలం తాలూకా.



శ్రీ స్వామినారాయణానంద సరస్వతి మునిలాల్



శ్రీ స్వామి నారాయణానంద సరస్వతి మణిలాల్

నారసింహస్వామివార్ని దర్శించుట

శ్రీ వేంకటేశాయనమః.

# పరతత్త్వ - మీమాంసా

---

సాంగోపాంగముగా వైదికసాహిత్యముయొక్క అనుశీలనచేత పరతత్త్వమే దానికి సారమని తేలుచున్నది. యీ హేతువుచేత దానికి వ్యాఖ్యానము వ్రాయుచుంటిని. 'పర' శబ్దమునకు అనేక అర్థములున్నవి. అమరకోశముయొక్క వచనము ఏమనగా:- 'దూరానాత్మోత్తమాః పరాః' అని. అనగా 'పర'శబ్దప్రయోగము దూరము, ఇతరుడు పైది, యీఅర్థములయందుండును. మరియు మేదినీకోశముయొక్క వచనము- 'పరాఃశ్రేష్ఠారిదూరాన్యోత్తరేక్లీబంతు కేవలే' అని- అనగా 'పర' శబ్దము నపుంసకలిఙ్గమందు చెప్పినప్పుడు 'కేవలము' అనియున్నూ పుంల్లిఙ్గమున శ్రేష్ఠము, శత్రువు, దూరము, అన్యము, పరము అనియు అర్థమగును. యీఅర్థములకు అతిరిక్తముగా పుంల్లిఙ్గసంజ్ఞరూపమునందు యీపరశబ్ద ప్రయోగము, ఆత్మా, ఈశ్వరుడు, బ్రహ్మయున్ను అను అర్థములు కూడా అగును. బాదరాయణుడు;-'పరాత్తు తచ్ఛ్రుతేః' (2, 3, 40) అనెడు ఈవేదాన్తసూత్రమునందు ఈశ్వరునినిమిత్తము 'పర' శబ్దప్రయోగము చేసిరి. గీతయొక్క అసక్తోహ్యాచరన్ కర్మపరమాప్నోతి పూరుషః ॥ (3-19) అను యీవచనమునందు 'పర' శబ్దమును ఆత్మకొరకు ప్రయోగించెను.

కూర్మపురాణవచనము:-'నిజేన తస్యమానేన చాతుర్వర్ష శతం స్మృతమ్। తత్ పరాఖ్యంతదర్థంచ పరార్ధ మభిధీయతే' అని యీవచనానుసారము బ్రహ్మదేవునియొక్క పూర్ణాయువును 'పర' అందురు. గీతయొక్క క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప । అను యీవచనమందు శత్రువు అనెడు అర్థమందు 'పర' శబ్దప్రయోగమువున్నది. సర్వనామ రూపమున యీశబ్దము ప్రయోగించునపుడు, అన్యము, ఇతరము అర్థమగును. ఉదాహరణార్థము-ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్॥ తనకు కష్టముగాయున్న పచనము ఇతరులకు ఉపయోగించరాదు- విశేషణరూపముగా ఉపయోగించునపుడు, 'పర'శబ్దమునకు దూరము, అధికము, అధిక దేశవృత్తి, ముఖ్య (ప్రధానము) సర్వోత్తమము, అతిక్రాన్తము, అర్థములగుచున్నవి. న్యాయసిద్ధాన్తముక్తావలీయొక్క వచనమేమనగా:-'పాటలిపుత్రాత్ కాశీమపేక్ష్య ప్రయోగః పరః' ఈవాక్యమునందు 'పర' అర్థము దేశమునుబట్టి దూరము అనివున్నది. గీతయొక్కవచనము;-అపరం భవతో జన్మపరం జన్మ వివస్వతః॥ ఈశ్లోకార్థమునందుకూడా 'పర' శబ్దము దూరమునకు చెప్పిరి. కాని ఇది కాలవిషయము. గీతయొక్క 'ఇన్ద్రియేభ్యః పరంమనః' అను నీవచనమునందు 'పర' శబ్దమునకు అర్థము ముఖ్యము లేక ప్రధానము అనివున్నది. పరశ్శతము, పరస్సహస్రము మొదలయిన ప్రయోగములందు 'పర' శబ్దార్థము 'అధికము' అధిక దేశవృత్తి అనికూడా వున్నది,

ఈఅర్థమునందు ఇదివై శేషికశాస్త్రోక్తసామాన్యమునకు విశేషణము అయివున్నది. సామాన్యంద్వివిధం ప్రోక్తం పరంచాపరమేవచ ॥ దీనివ్యాఖ్యానమునందు ముక్తావలియొక్క వచనమేమనగా:- 'పరత్వ మధికదేశవృత్తిత్వమ్। సకలజాత్యపేక్ష మధికదేశవృత్తిత్వాత్ సత్తాయాః పరత్వమ్' అని గీతయొక్క పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ అనెడు ఈ వచనమునందు 'పర' శబ్దార్థము సర్వోత్తము అనివున్నది—భాగవతముయొక్క శ్లో॥ నైర్గుణ్యమగమద్ భాస్వరం తమసః పరమ్ (10, 88, 25) అను సీవచనమునందు 'పర' శబ్దార్థము అతిక్రాన్తము. ఈశ్వరుడు ప్రకృతియందుండి దానిని నియమనచేయుచూ దానికి పరుడున్నాకూడా అయివున్నాడు. అను అర్థమును సూచించుటకొరకు 'పర' శబ్దమును ప్రయోగించెను. వేదముయొక్క వచనము- సభూమిం సర్వతోవృత్వాఽత్యతిష్ఠద్దశాఙ్గులమ్। (ఋక్సంహితా 10, 90) ఈఋగంశ ఈశ్వరుని విశ్వవ్యాపిత్వమును చెప్పి, విలక్షణుడుగను చేప్పినది. ఈ దృష్టిచేత 'పర' శబ్దార్థము అతిక్రాన్తము, అతిస్థితి, అతిగములను ఈశ్వరునియొక్క ఈఅతిక్రాన్త, అతిస్థితి, అతిగతిచేత అతనియొక్క విశ్వవ్యాపిత్వమునకు విరోధములేదు. అతడు అతనియొక్క మహామహిమచేత విశ్వమందువున్నాడు, పరుడైకూడా వున్నాడు. మనము ఏపరతత్త్వమునకు వ్యాఖ్యానము మొదలుపెట్టితిమో, అదిస్వేతర సమస్తవస్తువిలక్షణామై వున్నది. త్రిగుణాత్మికమగుజడ ప్రకృతికంటెను చేతనులగు

జీవజాతముకంటెను ఇతరమైయున్నది. అందుచేతనే పరమైయున్నది. అది తనకంటె భిన్నములగు సమస్తవస్తువులకన్న ఉత్తమము, ఉత్కృష్టము, ప్రకృష్టము, లేక శ్రేష్ఠమైనది. అందుచే 'పర'మైనది. అది తనయొక్క ఏకాంశముచేత పురుషప్రకృతిమయమై సమస్తలీలాస్థల విశ్వమందు అన్తః ప్రవిష్టమైయుండి శాసనముచేయుచున్నది. మరియు దానితోపాటు తనయొక్క త్రిపాదరూపముచేత ఈవిశ్వము నతిక్రమణచేసి, దీనికిపైగా చిదానందమయరూపమందు విరాజమానమై' యున్నది. ఈ హేతువుచేకూడా అది 'పర'మైయున్నది. ఇక్కడ ఈశంక వచ్చుచున్నది. ఏమన విశుద్ధావస్థయందు జీవుడు కూడా ప్రకృతికంటే పరుడైవున్నాడు. కావున అతడే ఈవ్యాఖ్యానమునకు లక్ష్యభూతుడు కావలెను. అని కాని దీనికి సమాధానమిది. ఏమన, జీవుని పరతత్త్వరూపముచేత ప్రతిపాదన చేయుట మాకు ఇష్టములేదు. జీవుడు ఆవిర్భూతస్వరూపుడై ప్రకృతికంటె పరుడగుచున్నాడనుట నిజము. కాని ఈశ్వరుడైతే ముక్తజీవునికంటెను పరుడైవున్నాడు. ఇందుచేతనే ఈశ్వరుడు 'పరాత్పరః' అని చెప్పబడుచున్నాడు. మరిన్ని అతనికంటె ఇతరమగు తత్త్వాన్తరములకు పరత్వమునిషేధింపబడుచున్నది. ఏప్రకారమనగా:-'యస్మాత్పరం నాపరమస్తి కిఞ్చిత్'. (శ్వేతాశ్వతర 3-9) 'మత్తః పరతరంనాన్యత్' (గీత 7-7) ఇత్యాదివచనములచే ఈవిషయము స్పష్టము పరత్వముయొక్క నిరతిశయత్వము జీవునియందులేక, ఈశ్వరుని

శ్లో. విశ్వం వ్యాప్యాపి యోదేవ
ఏతస్మాత్ పరతః స్థితః ।
పరస్మై శ్రీమతే తస్మై
విష్ణవేఽస్తు నమోనమః ॥

భాషావిజ్ఞానదృష్టితో చూచినచో 'పర' శబ్దప్రయోగము సర్వప్రథమ విశేషణముయొక్క రూపమునందుండి యుండును. ఈలేఖయొక్క శీర్షమునందుకూడా 'పర' శబ్దము విశేషణముయొక్క రూపమునందున్నది. సమయము దొర్కినప్పుడు 'పర' శబ్దప్రయోగము నామవాచకముయొక్క రూపమందుండుటకు ప్రారంభించెను. వైష్ణవాగమ సమయమందు ఈశబ్దము పారిభాషికముగా వాడబడెను. ఆవిషయము ఈ దిగువ ఉదాహరణచే తెలియును.

శ్లో. మమ ప్రకారాః పఞ్చేతి
ప్రాహుర్వేదాన్త పారగాః ।
పరోవ్యూహశ్చ విభవో
నియన్తా సర్వదేహినామ్ ॥

శ్లో॥ అర్చావతారశ్చ తథా
దయాలుః పురుషాకృతిః ॥
ఇత్యేవం పఞ్చధాప్రాహు
ర్మాం రహస్య విదోజనాః ॥ (విష్వక్సేనసంహితా)

బ్రహ్మసూత్రమందు మహర్షి బాదరాయణునుసు'పరా భిధ్యానాత్తు' మొదలగు 'సూత్రములందు పారిభాషిక పర

శబ్దప్రయోగమునే చేసియున్నారు. పరతత్త్వమునకు లోకవిశ్రుతుడు. నామము శ్రీమన్నారాయణుడు. వేదమునందును తదనుయాయియగు వాఙ్మయమునందును సుస్పష్టముగా శ్రీమన్నారాయణుని పరత్వము సిద్ధాన్తీకరింపబడి వున్నది. ఏగ్రింథములందు ఏ ఏ వచనములద్వారా ఈవిషయము నిర్దేశింపబడియున్నదో అది ముందు చెప్పబడుచున్నది. నరుల యొక్క సమూహము 'నార' అని చెప్పబడుచున్నది. నరశబ్దమందు- 'తస్యసమూహః' (పాణిని 4-2-37) అను సూత్రానుసారము సముహము అర్థమగు అణ్ ప్రత్యయము చేర్చుటచే నారశబ్దము అగుచున్నది. ఇక్కడ నారశబ్దము ప్రకృతితో చేరియున్న సమస్తజీవులకును ఉపలక్షణమై యున్నది. నార అనగా విశ్వబ్రహ్మాణ్డము అది ఎవనికి అయనమో అనగా ధామమో అనగా నివాసమో, అతడు నారాయణుడు. దీనిచే నారాయణుని విశ్వవ్యాపకత విశదమైనది.

యచ్చకిఞ్చి జ్జగత్సర్వం
దృశ్యతే శ్రూయతేఽథవా ॥
అ న్తర్బహిశ్చ తత్సర్వం
వ్యాప్యనారాయణః స్థితః ॥

ఇక్లే సమస్త బ్రహ్మాణ్డముయొక్క నివాసము ఎవనియందున్నదో అతడు నారాయణుడైవున్నాడు. 'తస్మిన్హ తస్థుర్భువనానివిశ్వా' ॥ (యజుర్వేద 31-3) సమస్తవిశ్వము, నారాయణునియొక్క ఏకాంశమునందు విరాజమానమై వున్నది.

'పాదోఽస్యవిశ్వాభూతాని' (యజుర్వేద 31-3) త్రిపాదస్వరూపముతో నారాయణుడు ఈవిశ్వ ప్రపఞ్చమునకంటె అతీతుడైఉన్నాడు. 'త్రిపాదస్యామృతందివి' (ఇది వెనుక చెప్పబడినది) దీనిచే నారాయణునియొక్క లోకాతీతత్వము-పరత్వము, స్పష్టముగా నిశ్చయింపబడినది. మహర్షియగు మనువు 'నారాయణ' శబ్దముయొక్క నిర్వచనచేయుచూ ఇట్లు చెప్పెను.

ఆపోనారా ఇతిప్రోక్తా
ఆపోవై నరసూనవః।
తా యదస్యాయనం ప్రోక్తం
తేన నారాయణః స్మృతః॥

అనగా నారములని జలమును చెప్పుదురు. మరియు ప్రలయపయోధియందు లేక క్షీరసాగరమందు శేషపర్యఙ్కము మీాద పరుండిన కారణముచే పరతత్త్వమును నారాయణుడు అని చెప్పుదురు. దీనిమీాద ఈశంకకలుగుచున్నది. ఏమనగా, 'పరతత్త్వమైతే ఒక్కటిమాత్రమే అయివున్నది. అప్పుడిట్లు చెప్పుట సమీాచీనము అయివున్నది. ఏమన నారాయణుడు పరతత్త్వము అని చెప్పుట సమంజసము. కాని శ్రీమన్నారాయణుడని చెప్పరాదు. ఎందుచేతనగా శ్రీసహిత నారాయణుని ప్రతిపాదించుటచేత పరతత్త్వము రెండు అగుచున్నవి. ఒకటి 'శ్రీ' రెండవది నారాయణుడు' అని యీశంకకు సమాధానము. ఇది ఏమన? 'శ్రీ' 'నారాయణుడు' అనురెండున్నూ ఒక్కటిమాత్రమే అయివున్నది. వాటి రెంటియందును

అభేదమున్నది; 'శ్రీ' యును 'నారాయణు'డును వేరు వేరు అని పట్టుదల వున్నప్పటికి కూడా శ్రీమన్నారాయణుకే పరత్వము ప్రతిపాదించుట ఉచితము. ఎందుచేత ననగా శాస్త్ర దృష్టిచేత ఇద్దరునూ పరులే. ఎట్లనగా విష్ణుపురాణముయొక్క వచనము. 'నానయోర్విద్యతే పరమ్' (1.8.35) అనగా శ్రీ నారాయణులకన్న పరతత్త్వము ఏదియును లేదు. దీనితో గీతయొక్క 'మత్తః పరతరంనాన్యత్' (7.7) అను ఈవచనమునుఏకవాక్యముగా చేసినమీాదట వాస్తవముగా శ్రీ నారాయణులయందు అభేదమున్నా పరతత్త్వమునకు ఏకత్వమును మాత్రమే సిద్ధమగుచున్నది.

పరతత్త్వమునకు రెండవనామము విష్ణువు. వేవేష్టి ఇతి విష్ణుః. ఏతత్త్వము చర-అచరములందు, జడ—చేతనములందు వ్యాప్తమైవున్నదో అన్నిటియందును కలసిపోయి వున్నదో ఆతత్త్వమే విష్ణువు. విష్ణుశబ్దమునకు సూర్యుడు వసువు అగ్ని మొదలయిన అనేకఅర్థములు వున్నప్పటికి-కూడా పైనవిమర్శించిన రీతిగా దార్శనికచర్చయందు విష్ణుశబ్దమునకు ముఖ్యార్థము, ఆపరతత్త్వమే అయివున్నది. విష్ణువు ! అన్నిదేవతలందు శ్రేష్ఠుడు. 'తస్మాదాహుర్విష్ణుర్దేవానాం శ్రేష్ఠః (శతపథ) అందుచేతనే శ్రీవిష్ణువుయొక్క-కృపకొరకు ప్రార్థనచేయుచూ పూజ్యమగుశ్రుతి ఇట్లు చెప్పుచున్నది. 'మహాస్తే విష్ణో సుమతిం భజామహే' అనగా హేవిష్ణో! నీవు మహామహనీయుడవు, పూజనీయుడవును, నీయొక్క సుమతిని అనగా దయాదృష్టిని

మేము సేవించుచున్నాము. పరతత్త్వముయొక్క ఉపాసకులైన వారు తమయొక్క యుపాస్య దేవతయొక్క ఉపనిష్ణనామముపై ఆధారపడియే తమను శ్రీవైష్ణవులుఅని చెప్పుకొనుచున్నారు. పరతత్త్వమునకు మూడవనామము పురుషుడు. ఈసమస్త లోకములును పురములు. 'ఇమే వై లోకాః పురః'(శతపథ) పరతత్త్వము ఈపురమందు శయనించియున్నదో, అతడు పురుషుడు. 'సోఽస్యాం పురి శేతే తస్మాత్పురుషః' (శతపథ) ఈపురుషునియొక్క మాహాత్మ్యమును ప్రతిపాదించెడు ఋగ్వేదముయొక్క 16 ఋక్కులుగల సూక్తము 'పురుషసూక్త' నామముచే అత్యన్త ప్రసిద్ధమైనది. మరియు దానిద్వారా విష్ణువునుపూజించుట సమ్ప్రదాయమై యున్నది. ఈసూక్తముయొక్క సారమేమనగా పురుషుడు ఈవిశ్వమును అన్నివిధములచేత నియమన పాలనములు చేయుచూ దీనికన్న పరుడై యున్నాడు. దీనినుండి విరాట్ పురుషుని వుత్పత్తికి అనన్తరము, ఋగాది వేదములు, ఇన్ద్రుడు, అగ్ని, వాయువు, ఆకాశము, అన్తరిక్షము, సూర్యుడు, చన్ద్రుడు, భూమి, దిశలు, అనేకలోకములు, బ్రాహ్మణాదివర్ణములు, గ్రామ్యపశువులు, ఆరణ్యపశువులు ఉత్పన్నమైనవి. యజుర్వేదమునగల పురుషసూక్తమందు 6మంత్రములు అధికముగాయున్నవి. పురుషశబ్దముచే జీవుడుకూడా చెప్పబడుచున్నాడు. అది ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ అను గీతావాక్యముచే విదితమగుచున్నది. అయినను ప్రకృతప్రసంగమందు ఈశబ్దము పర

తత్త్వమునుమాత్రమే చెప్పుచున్నది. పరతత్త్వము ఈప్రప్ర కృతిమయ విశ్వమందు, లోహమందున్న అగ్నివలె వ్యాప్తమై భిన్నమైననూ అభిన్నముగా విరాజిల్లుచున్నది

అయఃపిణ్డే యథావహ్ని
ర్భిన్నస్తిష్ఠత్య భిన్నవత్ ।
తద్వత్సర్వ మిదం దేవో
వ్యాప్యత్య పరితిష్ఠతి॥ (జయాంఖ్యసంహితా 4-83)

తనయొక్క వినోదముకొరకు ఈవిశ్వముయొక్క సృష్టి స్థితి, ప్రలయము చేయుచున్న కారణముచేత పరతత్త్వము నకు నాలుగవనామము బ్రహ్మ అని అందనూ స్వయంబృహాత్ మహాతో మహీయాన్, పరిపూర్ణతమాస్యము అగుటచే ఏవం పకృతియందు ప్రవిష్టుడైపృంజి దానిని వికసింపజేయుటచేత కూడా అతను బ్రహ్మఅని చెప్పబడును. బృంహతి వర్ధతే వర్ధయతివా ఇతి బ్రహ్మ! భ్వాదిగణీయ బృహింవృద్ధౌ ధాతువుచే మనిణ ప్రత్యయముగు చేర్చుటచేత బ్రహ్మ శబ్దము నిష్పన్న మవుచున్నది. బ్రహ్మ శబ్దమునకుకూడా వేద, తప, ఆదిఅనేక అర్థములున్నవి. 'వేదాస్తత్వం తపో బ్రహ్మ' (అమర కోశ 3.3.114) అయినప్పటికి ఇక్కడ ప్రసఙ్గానుసారముగా బ్రహ్మయొక్క అర్థము సృష్టియొక్క కర్తా, ధర్తా, హర్తా, పరతత్త్వమే అయివున్నది. బ్రహ్మ కారణము, మరియు జగత్తు కార్యము అయివున్నది. దీనిచే శంక వచ్చుచున్నది. ఏమనగా వికారీ, పరిణామీ, జగత్తుయొక్క కారణబ్రహ్మకూడా,

వికారీ పరిణామీా అయివుర్డిడవలెను. దీనికి సమాధానము ఈ ప్రకారముగా జగత్ యొక్క ఉపచయ, అపచయ, క్షయ; వృద్ధి ఆదివికార త్రిగుణాత్మకా ప్రకృతియందుమాత్ర ముండి వున్నది. ప్రకృతియొక్క అధిష్ఠాతా బ్రహ్మయందులేదు. దేవ దత్తునియందు ఏ కేశ; శ్మశ్రునఖోద్గమములున్నవో, అథవా కౌమార్య, యౌవన, జరా మొదలగునవి ఉద్భవములగు చున్నవో; అవిఅన్నియూ దేవదత్తునియొక్క శరీరమందు మాత్రమే వున్నవి. చేతనాంశమైతే నిర్వికారముగానేవున్నది కృకలాస అనగా వూసరవిల్లియందు, రక్త, నీల; పీత; హరిత వర్ణములయొక్క ఏపరివర్తనము కలుగుచున్నదో అవ న్నియూ దానియొక్క జడశరీరమందు మాత్రమే కలుగు చున్నవి, చేతనాంశమందులేదు. ఈప్రకారము మహత్తత్వాది పృథివ్యన్త పరిణామము ప్రకృతియందు మాత్రమే కలుగు చున్నది. బ్రహ్మయందు లేదు. బ్రహ్మయొక్క అధ్యక్షతయందు త్రిగుణముయందు పరిణామము కలుగుచున్నది. బ్రహ్మ యందులేదు.

మయాధ్యక్షేణ ప్రకృతిః.
సూయతే సచరాచరమ్॥ (గీత 9.10)

శాస్త్రమందు ఏది అటువంటి వచనము దొరక్కనో; దేనిచే జగత్తుయొక్క ఉత్పత్త్యాదివ్యాపారము బ్రహ్మచే ప్రతీతమగుచున్నదో ఏప్రకారమనగా-

శ్లో॥ యతః సర్వాణి (రూపాణి) భూతాని
భవన్త్యాది యుగాగమే।
యస్మింశ్చ ప్రలయం యాన్తి
పునరేవ యుగక్షయే.

వాటియొక్క అన్ని పర్యవసానములు దీనియందున్నవి. ఏమన? బ్రహ్మయొక్క అధ్యక్షతయందు కల్పారమ్భసమయమున త్రిగుణములయందు వికాసోన్ముఖపరిణామము కలుగుచున్నది. మరియు కల్పాన్తకేసమయు దానియందు వినాశోన్ముఖ పరిణామము కలుగుచున్నది. బ్రహ్మచే అధిష్ఠిత ప్రకృతిచేతని యేవే విశ్వముయొక్క ఉద్భవము అగుచున్నది మరియు దానియందు దానియొక్క విలయం అగుచున్నది. గీతయొక్క వచనమేమనగా—

శ్లో॥ సర్వభూతాని కౌన్తేయ
ప్రకృతిం యాన్తిమామికామ్।
కల్పక్షయే పునస్తాని
కల్పాదౌ విసృజామ్యహమ్. (9.7)

దేవదత్తునియందు చేతనాంశముతోకూడా జడాంశముకు ఏమి సంబంధముఉన్నది? దేహ—దేహీ-సమ్బన్ధ; శరీర-శరీరీ-సమ్బన్ధ; నియామ్య-నియన్తృ-సమ్బన్ధ; ప్రకార-ప్రకారీ-సమ్బన్ధ; శేష-శేషీ-సమ్బన్ధ; శరీర-ఆత్మా-సమ్బన్ధ; విశేష్య-విశేషణ-సమ్బన్ధ; బ్రహ్మకుకూడా జడ జగత్తుతోకూడా కాదు అపితు జీవాత్మలతో కూడా ఆత్మా—శరీర—సమ్బన్ధమునన్నది. బ్రహ్మ

ఆత్మస్థానీయుడు; మరియు పురుష ఏవం ప్రకృతిశరీరస్థానీయుడు. ప్రకృతియందు వివిధ విచిత్రపరిణామములు కలుగుచుండును. కిన్తు పురుషునియందులేవు. పురుషునియందు ప్రకృతియొక్క- సంగముచే అతనియొక్క- జ్ఞానమునకు సంకోచ - వికాస మాత్రము కలుగుచుండును; కిన్తు బ్రహ్మయందు అయితే పరిణామము; సంకోచ వికాసములులేవు. పరతత్త్వమునకు కేవల నాల్గునామములున్నవి. (1) నారాయణ, (2) విష్ణు; (3) పురుషుడు మరియు (4) బ్రహ్మ ఇంతవరకు చెప్పబడిన నామములైతే అనేకనామములున్నవి. ఎంతవరకూ లెక్కించగలము; అతఏవ పరతత్త్వమునకు అన్యాన్యనామములు శాస్త్రమువలన తెలియవలెను. శాస్త్రముఅని దేనిని అందురు. సన్మార్గమందు ప్రవృత్తి కలిగించే గ్రన్థ-కదమ్బమునకు శాస్త్రమని అందురు.

ఋగ్యజుః సామాథర్వాశ్చ
భారతం పఞ్చరాత్రకమ్ ।
మూలరామాయణం చైవ
శాస్త్రమిత్యభిధీయతే ॥
యచ్చానుకూలమేతస్య
తచ్చ శాస్త్రం ప్రకీర్తితమ్ ।
అతోఽన్యగ్రన్థ విస్తారో
నైవశాస్త్రంకు వర్త్మతత్ . (స్కన్దపురాణ)

అనగా, వేద, భారత, రామాయణ, పాఞ్చరాత్రసంహితా; మరియు తదనుకూలగ్రన్థాన్తర శాస్త్రనామముచే అభిహితము అయివున్నవి. వీటికి అతిరిక్త అన్యాన్యతత్ప్రతికూల గ్రన్థములు ఉపాధేయములుకావు. మహాభారతముయొక్క అనుశాసన పర్వమునందు పరతత్త్వముయొక్క సహస్రనామములు ఉపనద్ధితమై వున్నవి. ఇవియే విష్ణుసహస్రనామములని ప్రసిద్ధి. వీటి అధ్యయను చాలామాహాత్మ్యముగలది. కిన్తు భగవాన్ మరియు వాసుదేవనామములు చాలాప్రచలితములైనవి, పరతత్త్వముయొక్క దివ్యగుణములచేత విముగ్ధులయి భక్తజనులు దానిని భగవంతుడని చెప్పెదరు. ఈగుణముల యొక్క వివేచన విషయాన్తరము అగును. పూజార్థము నందు భగవత్ శబ్దముయొక్క ప్రయోగము వేదమందుకూడా ఉపలబ్ధమైవున్నది. ఏప్రకారమనగా:—

(అ) 'భగోవా భగవాం అస్తు'

(ఆ) 'వయం భగవన్తః స్యామ'

[ఇ) 'ఋగ్వేదం భగవోఽధ్యేమి'

ఏ దేవుడు విశ్వమందు నివాసమై వున్నాడో అతడు వాసుదేవుడు. వీనికన్న అతిరిక్త పరతత్త్వముయొక్క అన్ని నామములు మధురాతి మధురము లయినవి. శ్రీరామ మరియు కృష్ణులనామములు తెలియదో ఎంతపతితులను ఉద్ధరించినవో- మన్త్రమునందు శ్రీభగవానునియొక్క పవిత్ర వాణీరూపం ఏ వేదమున్నదో దానికి రెండు భాగములు—మన్త్ర

మరియూ బ్రాహ్మణము. ఋగాది నాల్గుసంహితలు మన్త్ర భాగముయొక్క గ్రన్థములు వున్నవి. మరియు వానియందు యథాస్థానపరతత్త్వముయొక్క ప్రతిపాదన సుందర—సుందరవచనములందువున్నవి. దిగ్దర్శనార్థము—'వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్య వర్ణం తమసః పరస్తాత్' (యజుర్వేద) దీని యందు స్పష్టముగానే ఆ మహాపురుషునియొక్క తమస్ అర్థాత్ ప్రకృతికంటె పరుడు అని చెప్పబడినది. ఈప్రకారము ఋగ్వేదముయొక్క నాసదీయసూక్తమందు చెప్పబడినది. యేప్రకారమనగా—

నాసదాసీన్నోసదాసీత్త దానీం
నాసీద్రజోనోవ్యోమాపరోయత్
ఆనీదవాతం స్వధయాతదేకం
తస్మాద్ధాన్యన్నాపరః కించనాస॥

అర్థాత్ సృష్టియొక్క ప్రారమ్భమందు ప్రకృతియొక్క రెండురూపములు—కార్య-కారణములు లేనిదానితో సమానముగావున్నవి. ('నేవవా ఇదమగ్రేఽసదాసీత్ నేవసదాసీత్' శతపథ 10.5.3) ఆసమయమున ఆపరతత్త్వముఒక్కటిమాత్రమే పాఞ్చభౌతిక పవనుని వినాగా కేవల తనయొక్క శక్తిచేతను జీవించివున్నది. దానికన్న పైగా మరికొంచము ఏదియులేదు. బ్రాహ్మణభాగమందు మన్త్రభాగముయొక్క వ్యాఖ్యాన స్వరూప ఐతరేయ, శతపథ, షడ్వింశ; గోపథ ఆదిగ్రన్థములు వేదముయొక్క బ్రాహ్మణభాగమునకు అన్తర్గతములైవున్నవి.

పీనియందు పరతత్త్వముయొక్క వర్ణనము మన్త్రభాగ మునకన్న అధిక విస్తారముగా యున్నది. పరతత్త్వమునకు నారాయణనామము వైదికసాహిత్యమందు సర్వప్రథమ బ్రాహ్మణభాగమందే దొరకును. పురుషసూక్తమునకు వ్యాఖ్యానము చేయుచూ శతపథము చెప్పుచున్నది. పురుషోహ నారాయణోఽ కామయత అతి తిష్ఠేయం సర్వాణిభూతాని। అర్థాత్ నారాయణపురుషుడు ఇట్లు సంకల్పించెను. ఏమన, నేను అన్నిభూతములకంటె- ప్రకృతి సంసృష్ట జీవులకంటె అతిక్రమించి, అనగా వాటికంటె పరుడనై వుందును. పర తత్త్వముయొక్క ఈ అతిస్థితికారణము దానియొక్క శ్రేష్ఠ తము నిరతిశయము అయివున్నది. తస్మాదాహుర్విష్ణుర్దేవా నాం శ్రేష్ఠః। ఆరణ్యకమునందు బ్రాహ్మణగ్రన్థమందు యజ్ఞ విధానముతోకూడా జ్ఞానము, భక్తికికూడానమావేశమున్నది. జ్ఞానము, వైరాగ్యము, భక్తి, ప్రతిపాదన అంశముయొక్క స్వాధ్యాయ- ప్రవచనములు,పీతరాగ మహాత్ములు బహుధా అరణ్యమునందుచేయుచుందురు. ఇందుచేత ఆఅంశమునకుఆర ణ్యకమని నామకరణమిడిరి. ఆరణ్యకగ్రన్థములందుకూడాఅక్క డక్కడ పరతత్త్వముయొక్క వర్ణన ప్రాఞ్జల భాషయందు చెప్ప బడి వున్నది. దిగ్దర్శనార్థము 'విరజఃపర ఆకాశాదజ ఆత్మా మహాన్ ధ్రువః' (బృహదారణ్యక 4-4-20) ఈ వచనమందు పరమాత్మని, అజన్మా, ఏకరస, రజస అర్థాత్ ప్రకృతికంటె అపరామృష్ట మరియూ దీనికంటె పరునిగాచెప్పి 'సర్వశ్యవశీ

సర్వస్యేశానః సర్వస్యాధిపతిః' (బృహదారణ్యక 4-4/22. ఈవచనమందు అతడు సమస్తవిశ్వమునకు ప్రభువు, శాసకుడు, మరియు నియామకుడు అని చెప్పబడినది. ఉపనిషత్తుల యందు బ్రాహ్మణభాగముయొక్క ఉపాసనా ప్రతిపాదకము లైన గ్రన్థములకు ఉపనిషద్ అని చెప్పబడును, ఇవి అయితే పరతత్త్వముయొక్క చర్చచేసిచేసి, పరతత్త్వమునకు ఉపాసకులై మరియు తమయొక్క స్వానుభూతిద్వారా దానియొక్క ఉపాసనయందు సతతము, నిరతము వున్నవి. దిగ్దర్శనార్థము—'ఏతద్ధ్యేవాక్షరం పరమ్' (కఠ 1-2–16) ఇదియేసుమా అవినాశి అయిన పరతత్త్వము. 'ఏతదాలమ్బనం పరమ్. (కఠ 1-2—17) ఇదియే సుమీ సర్వోత్తమమైనఆలమ్బన అయి వున్నది. 'అక్షరం బ్రహ్మయత్ పరమ్' (కఠ 1-2--3) అవినాశీ బ్రహ్మపరతత్త్వమై వున్నది. 'అక్షరాత్ పరతఃపరః' ముణ్డక 2,1,4) ప్రకృతికంటె పరము, జీవునికంటెకూడా అది పరమైవున్నది. 'పరాత్పరం పురుషముపైతిదివ్యమ్' (ముణ్డక 3-2-8) జ్ఞానముగలవ్యక్తి పరాత్పర పురుషుని సామీప్యమున పొందుచున్నాడు. 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' (తైత్తిరీయ 2-1-1) బ్రహ్మవేత్త వ్యక్తి పరతత్త్వమును పొందుచున్నాడు. 'యస్మాత్పరం నాపరమస్తి కించిత్' (శ్వేతాశ్వతర 3—9) దానికంటె పరము మరి కొంచమూలేదు. 'తత్త్వంనారాయణః పరమ్' (నారాయణోపనిషత్) నారాయణుడే పర

తత్త్వమై వున్నది. రామాయణమునందు ఏరామాయణము కొరకు యీసూక్తి ప్రచలితమైనదో ఏమన—

శ్లో॥ వేదవేద్యే పరేపుంసి
జాతే దశరథాత్మజే।
వేదః ప్రాచేతసాదాసీత్
సాక్షాద్రామాయణాత్మనా॥

అనగా దశరథభవనమందు వేదగమ్య పరమపురుషుని యొక్క అవతీర్ణమైన మీదట వేదము సాక్షాత్ మహర్షి వాల్మీకి ద్వారా రామాయణరూపముచే ప్రకటమైనది. ఆరామాయణమందే పరతత్త్వముయొక్క సమ్యక్ నిరూపణ అయి వున్నది. ఈ ఆదికావ్యముయొక్క నాయకుడు స్వయం భగవాన్ విష్ణువు అయివున్నాడు. దీనియొక్క ఆది, మధ్య, అన్తమందు, పరతత్త్వము శ్రీవిష్ణువే రామరూపము ధరించి అవతరించెను. దిగ్దర్శనార్థము— 'భవాన్నారాయణో దేవః'(6,117 'త్వమోంకారః పరాత్పరః' (6-117) ఈవచనములందు బ్రహ్మదేవుడు స్తుతిచేయుచూ చెప్పెను. ఏమనగా! ఓ రామా నీవు నారాయణుడవు, ప్రణవస్వరూపుడవు మరియు పరాత్పరుడవు అయివున్నావు. ఈప్రకారమే అధ్యాత్మరామాయణముయొక్క అయోధ్యా కాణ్డమందు చెప్పబడివున్నది. ఏమన, అత్రి మహర్షి శ్రీరాముని పరతత్త్వనారాయణుడని తెలిసికొని వానికి విధిపూర్వకముగా పూజించెను.

శ్లో॥ శ్రుత్వా రామస్య వచనం
రామం జ్ఞాత్వా హరిం పరమ్।

పూజయామాస విధివద్
భక్త్యా పరమయామునిః ॥ (9-82)

స్మృతియందు:—సాధారణధర్మ, విశేషధర్మ, వర్ణాశ్రమధర్మ, ఆచార, వ్యవహార, ప్రాయశ్చిత్త, ఆదివిషయములయందు, ప్రచురప్రకాశపరచు ధర్మగ్రన్థములకు, స్మృతులని చెప్పుదురు. యద్యపిసామాన్యరూపముచే శ్రుతీతర అన్ని గ్రన్థములకు స్మృతులని చెప్పుదురు. తథాపి విశేషరూపముచేత– 'మన్వత్రివిష్ణుహారీతయాజ్ఞవల్క్యోశనోఙ్గిరాః' యాజ్ఞవల్క్యస్మృతి (1–1-4) ఇత్యాది వచనానుసారము మన్వాది మహర్షులుద్వారా ప్రణీతధర్మగ్రన్థములు స్మృతిరూపమున వ్యవహృతములైవున్నవి. వీనియందు యథాస్థానముల పరతత్త్వముయొక్క స్మరణచేయబడివున్నది. ఉదాహరణార్థ మనుస్మృతియొక్క ఒకవచన మిది–

ప్రశాసితారం సర్వేషా
మణీయాంస మణీయసామ్ ।
రుక్మాభం స్వప్నధీగమ్యం
విద్యాత్తం పురుషం పరమ్॥ (12-122)

అనగా సమస్త జీవనికాయమునకు శాసకుడున్నూ, అణుస్వరూపజీవులకంటెనూ కూడా అధిక అణురూపుడున్నూ, సువర్ణోపమవర్ణవిశిష్టుడు, నిర్మలబుద్ధిద్వారా ప్రాప్యమయ్యేపురుషుని పరతత్త్వమని తెలియవలయును– బ్రహ్మసూత్రములందు– అత్యన్తవిస్తృతఉపనిషద్- గ్రన్థములయొక్క సంక్షే

పను, ఒక్క మహర్షి వేదవ్యాసులు ప్రస్తుతపరచెను. దీనిపేరు బ్రహ్మసూత్రములు— ఈ సూత్రగ్రన్థమునందు బ్రహ్మయొక్క నామములచేత పరతత్త్వమునే వర్ణింపబడివున్నది. సాక్షాత్ అనేకశబ్దములయందు 'పర'శబ్దప్రయోగమువున్నది. ఏప్రకార మనగా:— 'పరాత్తుతచ్ఛ్రుతేః' (2-3-41) బ్రహ్మసూత్రమున ఒక పరాధికరణ అనుపేరుగల స్వతన్త్రఅధికరణవున్నది. బ్రహ్మ కంటె ఇతరము మరికొంచమూలేదు- అని యుక్తిపూర్వక ముగా యీ అధికరణమున సిద్ధాన్తము చేయబడినది. విశే షణరూపమందు ప్రయుక్త 'పర' శబ్దము సమయము వచ్చి నపుడు పారిభాషికశబ్దముగామారును అని యింతకుముందు చెప్పబడినది. మహాభారతమందు:—మహాభారతనామకవ్యా సకృతగ్రన్థము అత్యన్త ప్రసిద్ధమయినది. దీనియందు అచ్చ టచ్చట పరతత్త్వముయొక్క మహిమను గానముచేయబడినది. ఉదాహరణార్థం.

ఏషప్రకృతిరవ్యక్తా । కర్తాచైవ సనాతనః ।
పరశ్చ సర్వభూతేభ్య ।స్త స్మాత్ పూజ్యతమోహరిః
సభాపర్వ (38-24॥)

అనగా శ్రీభగవాన్ అవాఙ్మనసగోచరుడు మూల కారణుడు, జగత్తునకు సనాతనకర్త, సమస్తభూతముల కంటె పరుడు, ఇందుచేత వారు పూజ్యతములు అనిచెప్పిరి. ఏవం-

శ్లో॥ నీలోత్పలదలశ్యామ పద్మగర్భారుణేక్షణ ।
పీతామ్బరపధాన లసత్కౌస్తుభభూషణ॥

శ్లో॥ త్వమాదిరన్తో భూతానాం త్వమేవచ పరాయణమ్ ।
పరాత్పరతరం జ్యోతి ర్విశ్వాత్మా విశ్వతోముఖః॥
(వనపర్వ)

హే! నీలకమలముతో సమానవర్ణముగలాడ, అరవిందముయొక్క అన్తస్తలముతో సమానఅరుణాభనయనములు గలాడ, పీతామ్బరధారీ, కౌస్తుభవిభూషితభగవన్! సర్వప్రాణులయొక్క ఉత్పాదక వినాశకుడవు, నీయందే వానియొక్క స్థితి నీవు ఈవిశ్వమునకు అన్తరాత్మవు, నీవు సర్వవ్యాపకుడవు, ప్రకాశస్వరూపుడవు, పరాత్పరుడవు అయి వున్నావు. ఈప్రకారముగా—

శ్లో॥ అపిదేవా నజానన్తి
గుహ్యమాద్యం జగత్పతిమ్।
నారాయణం పరం దేవం
పరమాత్మాన మీశ్వరమ్॥

శ్లో॥ జ్ఞానయోనిం హరిం విష్ణుం
ముముక్షూణాం పరాయణమ్।
పరం పురాణం పురుషం
పురాణానాం పరంచయత్ ॥ (ద్రోణపర్వ)

అనగా దేవతలుకూడా పరతత్త్వ నారాయణుడని తెలుసుకొనలేరు. ఎట్టివానిననగా, ఏదిగుహ్యమో, ఆద్య, జగత్పతి, పరమాత్మ, ఈశ్వర, వేదములను రచించినవాడు హరి విష్ణు, హిరణ్యగర్భాది పూర్వపురుషులకంటెను కూడా

పూర్వాహ్న, మరియు అన్నిటికంటెను పరమైనవానిని దేవతలు సహా తెలియలేరు- గీతయందు యద్యపిగీతా మహాభారతముయొక్క- ఒక అంశము అయివున్నది. తథాపి దానియొక్క- మహాత్మ్యాతిశయకారణముచేత మనము గీతను పృథక్ గా నిర్దేశము చేయుచున్నాము. ఉపనిషద్లయొక్క- సారస్వరూపమైన ఈపవిత్ర గీతాగ్రంథము పరతత్త్వముయొక్క- గౌరవమును గానరూపమున ప్రచురముచేయుచున్నది. దిగ్దర్శనార్థము— 'సతం పరం పురుషము పైతిదివ్యమ్.' (8-10) అనగా, సాధకజీవుడు ఆదివ్యపరమపురుషునియొక్క- లాభము ప్రాప్తి పొందుచున్నాడు. ఏవమ్—పురుషః సపరః పార్థభక్త్యా లభ్య స్త్వనన్యయా? (8-22) అనగా ఆసర్వవ్యాపకపరతత్త్వము అనన్యభక్తిభావముచేతనూత్రమే ప్రాప్యమును పొందుచున్నారు. పురాణములయందు—— సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశానుచరితములయొక్క- ప్రతిపాదనముచేయు శాస్త్రమునకు పురాణమని పేరు, మొదట వ్యాసులువారు ఒక పురాణసంహితా వ్రాసినారు. పురాణసంహితాం చక్రే పురాణార్థవిశారదః (విష్ణుపురాణము 3-6-15)

దీనియొక్క- ఆధారంపైన అన్యాన్యపురాణసంహితలు యథాసమయమున విరచితములయినవి. మరియు మహాపురాణ- ఉపపురాణమును నామములచే ప్రసిద్ధికెక్కినవి. బ్రహ్మపురాణ ఆది పదునెనిమిదిపురాణములున్నవి. వీనినన్నిటియందు శ్రీమద్భాగవతము మకుటమణి అయివున్నది. ఈ

అన్నిపురాణములయందును పరతత్త్వముయొక్క వైభవము ఉల్లేఖించబడియున్నది. వ్యాసజీచెయ్యి పైకిఎత్తి మాటిమాటికి ఘోషణచేయుచున్నారు. యేమన:—

శ్లో॥ సత్యం సత్యం పునః సత్యం
భుజముద్ధృత్య చోచ్యతే ।
న వేదాన్తాత్ పరంశాస్త్రం
న దేవః కేశవాత్ పరః॥

అనగా, వేదాంతమునకంటె పెద్దదగు మరొకశాస్త్రములేదు. మరియు, భగవాన్ కేశవ (నారాయణుడు) కంటె పైగా మరిఎవరున్నా దేవుడులేడు. విష్ణుపురాణముయొక్క వచనము—

శ్లో॥ త్వామారాధ్య పరంబ్రహ్మ యాతాముక్తిం ముముక్షవః।
వాసుదేవమనారాధ్య కో మోక్షం సమవాప్నుయాత్॥
(1-4-18)

అనగా హేభగవన్, ముక్తినికోరు అనేకజీవులు పరబ్రహ్మవైన నీయొక్క ఆరాధనచేసి ముక్తిని పొందినారు. వాసుదేవునియొక్క ఆరాధనచేయకుండగ మోక్షమును ఎవరు పొందగలరు? ఆగమములయందు:—ఆగమమునకర్థము, జ్ఞానప్రాప్తి చేయునది. ఆగమయతీతి ఆగమః। పాఞ్చరాత్రశాస్త్ర, సాత్వతశాస్త్ర, సాత్వతతన్త్ర, పాఞ్చరాత్రతన్త్ర, ఇవన్నియు ఆగమమునకు (వైష్ణవఆగమ) పర్యాయములు అయియున్నవి. శ్రీ విష్ణూపాసకులకు, భాగవతులకు, ప్రాచీనవైష్ణవసాహిత్య

పాఞ్చరాత్రశాస్త్రమని చెప్పబడుచున్నది. దీనికి మూడు సంహితలు. 1. సాత్వతసంహితా, 2. జయాఖ్యసంహితా, 3, పౌష్కరసంహితా, రత్నత్రయములని చెప్పబడుచున్నవి. సమయమువచ్చినప్పుడు పౌరాణికసాహిత్యమునకు సమాన పాఞ్చరాత్రిసాహిత్యమునకు కూడా అధికాధికవిస్తార మున్నది. దానికి 108 సంహితలు చెప్పబడుచున్నవి. యద్యపి ఇంతకన్న అధికముగాకూడా సంహితలయొక్క నామావలీ ఈరోజులలో దొరుకుచున్నవి. పాఞ్చరాత్రమునందు పరతత్త్వ మునొయొక్క వైభవము పునఃపునః విస్తారపూర్వకముగా సము పర్ణితములై వున్నవి. దిగ్దర్శనార్థము.

(అ) 'పరమేతత్ సమాఖ్యాతమ్!' (సాత్వతసంహిత, 1.16)

(ఆ) 'వాసుదేవః పరః ప్రిభుః' (సాత్వతసంహిత 3.5)

ఇ) 'అప్రిమేయమజంవిష్ణుం శరణం త్వాం గతోఽస్మ్యహమ్।
గుణాతీతం పరంశాన్తమబ్జనాభం సురేశ్వరమ్॥
(బ్రిహ్మాతన్త్రి)

అనగా షాడ్గుణ్యవిగ్రిహబ్రహ్మయొక్క నామము పరమనివున్నది. వాసుదేవుడు ప్రిభువు, పరతత్త్వము అయి వున్నాడు. నేను శ్రీవిష్ణునామము గతపరతత్త్వమును శరణు జొచ్చివున్నాను. ఇతడే అప్రిమేయుడున్నూ త్రిగుణాతీతుడు, శాన్తుడు, సురేశ్వరుడున్నూ, అయివున్నాడు, మరియు ఇతని యొక్కనాభినుండి బ్రిహ్మవాసమైన కమలము ప్రాదుర్భావ మైనది. ఆచార్యులయొక్క రచనలందు—ఆచార్యస్వాములు,

పరతత్త్వమైన శ్రీభగవానునికి తమయొక్క స్త్వాజ్ఞలుల సమర్పించి తమయొక్క సపర్యాభావములు ప్రదర్శించినారు. ఉదాహరణార్థము—

శ్లో॥ దివ్యధునీమకరన్దే పరిమల పరిభోగసచ్చిదానన్దే।
శ్రీపతి పదారవిన్దే భవభయఖేదచ్ఛిదే వన్దే॥
(శఙ్కరాచార్య)

అనగా నేను శ్రీమన్నారాయణునియొక్క ఆచరణార విందములకు నమస్కారముచేయుచున్నాను. ఎవనియొక్క మకరన్దము గంగాజీ అయినదో, సత్, చిత్ ఆనందములను సుగంధములెవనినుండి బయలుపడినవో, మరియు, సంసారము యొక్క సమస్తభయము ఖేదమును శమనముచేయువాడో వానిక్ నమస్కారము—

శ్లో॥ అఖిల భువనజన్మస్థేమభఙ్గాదిలీలే।
వినతవివిధభూతవ్రాతరక్షైకదీక్షే।
శ్రుతిశిరసివిదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే।
భవతు మమ పరస్మిఞ్ శేముషీభక్తిరూపా.
(రామానుజాచార్య)

అనగా; లీలకొరకు నిఖిలబ్రహ్మాణ్డములను, ఉదయ, విభవ, లయములుచేయువాడు, శరణాగతులైనభక్తులయొక్క రక్షణయందు నిరంతరము బద్ధపరికరుడో, ఉపనిషద్‌లయందు ప్రతిపాదింపబడినవాడు, శ్రీనివాసు పరబ్రహ్మయందు నాభక్తి వుండుగాక!

శ్లో॥ స్వభావతోఽపాస్తసమస్తదోషమశేషకల్యాణ
గుణైకరాశిమ్, వ్యూహాఙ్గినం బ్రహ్మపరం
వరేణ్యం ధ్యాయేమ కృష్ణం కమలేక్షణం హరిమ్॥
(నిమ్బార్కాచార్య)

అనగా, నిఖిలహేయ-ప్రత్యనీక, సమస్త కల్యాణగుణా కార, వ్యూహాఙ్గీ, వరణీయ, కమలనయన హరి పరబ్రహ్మ శ్రీకృష్ణుని మనమందరము ధ్యానము చేయుదము.

అన్తఃకరణ మద్వాక్యం
సావధానతయాశృణు ।
కృష్ణాత్ పరం నాస్తి దైవం
వస్తుదోష వివర్జితమ్॥ (వల్లభాచార్య)

అనగా హే నాయొక్క-హృదయము సావధానమవై వినుము. శ్రీకృష్ణునికంటె వేరే ఏదియూకూడా నిర్దోషదివ్య వస్తు (తత్త్వం) లేదు. భక్తాగ్రగణ్యులు చెప్పినవాక్యము సత్త్వగుణము ఎవరికి విభూషణమై వున్నదో అట్టి మహా మనసుగల భక్తమహాత్ములు పరతత్త్వమునకు స్తుతి, ధ్యాన, భజనలుచేసి తమయొక్క జన్మలు సఫలములు గావించుకొనిరి, అట్టిమహాత్ములు భరతఖండమున అన్నిప్రాంతములయందు నుండిరి. దక్షిణ దేశమందు ఆల్వారులు సమయసమయములందు ప్రకటమయి పర-తత్త్వపూజను నిర్మల, అక్షుణ్ణముగా జరుగు టకు, స్తుత్యప్రయత్నములు చేసిరి. తమయొక్క పవిత్ర ప్రేమమయమయిన వాక్కులచేత వారు భారతభూమిని భక్తి

భావముచేత ఆప్లావితము గావించిరి. వారివచనములందు ఆకర్షణవున్నది. వారు ప్రేమోన్మాద మదిరములు. వారియొక్క నామములు విష్ణుచిత్త, గోదా, సరోయోగీ, భూతయోగీ, మహాయోగీ, మునివాహన, భక్తాంఘ్రిరేణు, భక్తిసార, కుల శేఖర, మధుర, శఠకోప, మరియు పరకాల, దిగ్దర్శనార్థం కులశేఖర విరచితము కున్దమాలయొక్క ఒక శ్లోకము వ్రాయుచుంటిమి.

శ్లో. చిన్తయామిహరి మేవ
సన్తతం, మన్దమన్ద హసితాననామ్బుజమ్।
నన్దగోపతనయం పరాత్పరం
నారదాది మునిబృన్దవన్దితమ్॥

అనగా మన్దచిరునవ్వుచే విలసితవదనముగలిగి, నారదాది మునులద్వారా నిషేవితముయి నన్దునియొక్క నన్దనుడైన పరాత్పర శ్రీహరికి నేను నిరన్తరము చిన్తనము చేయుచున్నాను. ఆల్వారులకు శిరోమణియైన యామునాచార్యుల వారిని ఆలవన్దార్ అని చెప్పుదురు. వీరియొక్క స్తుతిశైలి యీప్రకారమున్నది.

శ్లో. నమృషా పరమార్థమేవమే
శృణు విజ్ఞాపన మేకమగ్రతః।
యదిమే నదయిష్యసే తతో
దయనీయస్తవనాథ దుర్లభః॥

అనగా హేనాథ! నేను అబద్ధముకాదు నిజము చెప్పుచున్నాను. దయయుంచి నాయొక్క యీసూచన వినుము. నాయందు దయనీకు ఇప్పుడు కలుగకపోయినచో, నాకంటె దయనీయుడైన మరొకవ్యక్తి నీకు ఎక్కడనూ దొరకడుసుమా. మధుసూధన సరస్వతీస్వామి తనయొక్క గీతాభాష్యమందు ఒకస్థానమున ఇట్లువ్రాసెను.

శ్లో. వంశీవిభూషిత కరాన్నవనీరదాభాత్
పీతాంబరాదరుణబింబ ఫలాధరోష్ఠాత్ ।
పూర్ణేందుసుందర ముఖాదరవింద నేత్రాత్
కృష్ణాత్పరం కిమపి తత్త్వమహం న జానే.

అనగా కరకిసలయమందు మధుర మురళిని ధరించిన, శ్యామసుందర పీతాంబరధారీ బింబఫలముతో సమానఓష్ఠము గలిగి పూర్ణచంద్రుని లజ్జింపచేయు మోముకలిగి కమలముల వంటి నేత్రములుగల శ్రీకృష్ణునికంటె పైగా నేను మరి ఏతత్త్వమును ఎరుగను. వేంకటనాథుడు పాంచరాత్రరక్షయందు ఒకస్థానమందిట్లు వ్రాసెను.

శ్లో. సవ్యంపాదం ప్రసార్యశ్రిత దురితహరం దక్షిణం కుంచయిత్వా!
జానున్యాధాయసవ్యేతర భుజమపరంనాగభోగే నిధాయ,
పశ్చాద్బాహుద్వయేన ప్రతిభటశమనే ధారయఞ్చ శంఖచక్రే।
దేవీ భూషాదిజుష్టో నవజలదనిభః పాతుదివ్యఃపరోనః ॥

అనగా ఎడమకాలుసాచి మరియు కుడికాలు ముడుచు
కుని కుడిచేతిని కాలి బొటనవ్రేలుమీదనుంచి మరియు ఎడమ
చేయి శేషజీయందుంచి, పైనవున్న రెండుచేతులయందు
శఙ్ఖ-చక్రములు ధరించివుండి అలఙ్కారము లన్నిటిచేత నలం
కరింపబడి నీలనీరదములకు సమానమైన వర్ణముగలిగిన
శ్రీమాన్ దివ్యపరతత్త్వమైన నారాయణుడు నన్నుగక్షించు
గాక. కవిత్వములయందు పురాతన నూతన కవివరులు పర
తత్త్వముయొక్క సపర్యకొరకు అనేక కాన్త పదావలులచే
కమనీయ పుష్పమాలలవలె గుచ్చియున్నారు. సంస్కృత
మునకు కాళిదాస; మాఘ; శ్రీహర్ష;ఆదిఏవం హిందీకి సూర;
తులసీ; కేశవ ఆదికవివరులు, రామ; మరియు కృష్ణులగుణ
చరిత్రముల వ్రాసి తమయొక్క లేఖిని పవిత్రముల గావించు
కొనిరి. శ్రీమద్భాగవతమునందు భగవద్ గుణానువాద
విషయమందు చక్కగానే చెప్పియున్నారు. ఏమనః-

శ్లో॥ తవ కథామృతం తప్తజీవనం
కవిభిరీడితం కల్మషాపహమ్ ॥
శ్రవణమఙ్గలం శ్రీమదాతతం
భువిగృణన్తి తే భూరిదాజనాః ॥ (10-31-9)

అనగా హేప్రభో! ఎవరు నీయొక్క కలికల్మష-
వినాశన శ్రుతిమధుర కథామృతమును పానము చేయుచున్నా
రో, ఎవనిని, సత్కవులు తమయొక్క విభిన్నదృశ్యశ్రావ్యకావ్య
ములకు మూలాధారముగాజేసుకొనిరో అట్టివారు ఈభూవల

యమందు నివాసముచేయుచున్న పరమపుణ్యాత్ములైన మానవులు కవికులగురు కాళిదాసు తనయొక్క రఘువంశమందు ఇట్లు వ్రాసెను—

శ్లో॥ బహుధాప్యాగమైర్భిన్నాః పన్థానః సిద్ధిహేతవః ।
త్వయ్యేవ నిపతన్త్యోఘా జాహ్నవీయా ఇవార్ణవే॥ (10.26)

అనగా హేభగవన్! నిన్ను చేరుటకు అనేకమార్గములున్నవి. కిన్తు అవి అన్నియూ భిన్నభిన్నములైనప్పటికీ నీయందిట్లు చేరుచున్నవి. ఎట్లనగా గంగానదియొక్క అన్ని ధారలు, సముద్రమందు చేరుచున్నట్లుగా నిన్నే పొందుచున్నవని—

శ్లో॥ త్వామావేశితచిత్తానాం త్వత్సమర్పితకర్మణామ్
గతిస్త్వం వీతరాగాణామభూయః సన్నివృత్తయే॥
(10-27)

అనగా హేభగవన్! నిన్ను నిరంతరము చింతనచేయువారు తమయొక్క సమస్తకర్మలు నీయందు సమర్పణచేయువారు, అగు వీతరాగమహాత్ములను నీవు నీయొక్క చరణకమలములందు ఉంచుదువు, వారు తిరిగి సంసారబంధనమున చిక్కరు—

శ్లో॥ అనవాప్తమవాప్తవ్యం న తే కించన విద్యతే।
లోకానుగ్రహ ఏవైకో హేతుస్తే జన్మకర్మణోః॥ (10.31)

అనగా హేభగవన్! నీకు తే ఏవస్తువు ప్రాప్తవ్యము-అప్రాప్తవ్యములేదు. అట్టిఎడ నీవు భూలోకమందు సమయ

సమయములందు అవతీర్ణుడవై వివిధలీలలు చేయుచున్నావు. వాటికిప్రయోజనము నీకుసంసారముపైనవున్న అనుగ్రహామేను.

శ్లో॥ మహిమానం యదుత్కీర్త్య తవ సంహ్రియతే వచః।
శ్రమేణ తదశక్త్యావా న గుణానామియత్తయా. (10-32)

అనగా హేభగవన్! నీయొక్క మహిమ కీర్తనచేసి మేము ఊరకొని యున్నాము. దానికికారణము ఇదికాదు. నీయొక్క గుణములు ఇంతేఅని మేము అలసిపోయియుంటిమి. నీయొక్కగుణములు పూర్ణరూపేణ వర్ణనచేయుటకు మా యందుశక్తిలేదు, మాఘుకవివరుడు శిశుపాలవధయందు ఇట్లు వ్రాసియుండెను.

శ్లో. ధ్యేయమేక మపథేస్థితం ధియః
స్తుత్యముత్తమ మతీత వాక్పథమ్
ఆమనన్తియముపాస్య మాదరాద్
దూరవర్తిన మతీవ యోగినః. (14-60)

అనగా యుధిష్టరునితో శ్రీకృష్ణమహాత్మ్యమును వర్ణించుచూ భీష్మపితామహుడు చెప్పుచుండెను. ఏమన యోగి జనులు శ్రీభగవానుని బుద్ధికంటె పైగా వున్నప్పటికికూడా ఏకమాత్రధ్యేయుడుగా చెప్పుచున్నారు. అవర్ణనీయుడు అయి నప్పటికికూడా సర్వోత్తమస్తవనీయుడని చెప్పుచున్నారు. ఏవం అత్యన్తదూరమందున్నప్పటికీ కూడా, పరమాదరము చేత ఉపాసనచేయుటకు ఎదురుగా నుంచ్చని వుండుటకు యోగ్యుడు అని చెప్పుచున్నారు.

శ్లో॥ శ్రౌతమార్గ సుఖగానకోవిద
బ్రహ్మషట్చరణ గర్భముజ్జ్వలమ్
శ్రీముఖేన్దు సవిధేఽపి శోభతే
యస్యనాభి సరసీసరోరుహమ్ ॥ (14-69)

అనగా వేదమార్గముయొక్క ఆనన్దదాయకగానమందు నిష్ణాత బ్రహ్మదేవుడు భ్రమరముతో సమానముగా ప్రతీతమై ఉన్నాడు. అటువంటి భగవంతునియొక్క నాభి సరోవరము యొక్క ఉజ్జ్వలకమలము శ్రీలక్ష్మీదేవి ముఖరూపీచన్ద్రునికి సాన్నిధ్యమందుకూడా వికసించివున్నది.

శ్లో॥ సత్యవృత్తమపి మాయినం జగద్
వృద్ధమప్యుచిత నిద్రి మర్భకమ్ ।
జన్మవిభ్రితమజం నవం బుధా
యం పురాణపురుషం ప్రిచక్షతే॥ (14-70)

అనగా విద్వజ్జనులు శ్రీభగవానుని నిష్కపటుడైనప్పటికి కూడా మాయారూపీ అని చెప్పెదురు. సర్వలోక పితామహుడు, (వృద్ధుడు) అయినప్పటికికూడా వటపత్రిశాయి బాలుడు అని చెప్పెదురు. అజన్ముడు అయినప్పటికికూడా యుగ-యుగములందు అవతారములు ధరించువానిగా చెప్పెదురు. మరియు సర్వప్రాచీనపురుషుడైనప్పటికికూడానవీన (నవ యువక-కిశోర) అని చెప్పుదురు. కవి ముకుటమణి శ్రీహర్షుడు తనయొక్క నైషధీయచరిత్రయందు శ్రీమన్నారాయణుని యొక్క గుణములను గానముచేసి తనయొక్క కవిత్వమును సఫలమును గావించుకొనెను. దిగ్దర్శనార్థము—

శ్లో॥ స్వప్రకాశ జడఏష జనస్తే
వర్ణనం యదభిలష్యతి కర్తుమ్।
నన్వహర్పతి మహః ప్రతిసస్యా
న్నప్రకాశ నరస స్తమసః కిమ్॥ (21-53)

అనగా నిషదాధిపతి మహారాజు నలుడు ఉపాసనవేళ యందు స్తుతి ఈప్రకారం చేయుచున్నాడు. ఏమనగా హేభగవన్! నీవు స్వప్రకాశుడవు. నిన్ను నేను స్తుతిచేయుట ఎట్లున్నదనగా సూర్యదేవుని ప్రకాశింపజేయుటకు అన్ధకారమునకు ఇచ్ఛ గలిగినటులున్నది.

శ్లో॥ లీలయాపి తవనామజనా యే
గృహ్ణతే నరకనాశకరస్య।
తేభ్య ఏవ నరకైరుచితాభి
స్తేతు బిభ్యతు కథం నరకేభ్యః॥ . (21-111)

అనగా హే నరకవినాశక! నీయొక్క నామమును నవ్వుల యందు ఆటలయందునుకూడా స్మరించువారిని చూచి యమభటులు భయపడుచుందురు. అట్టియెడ నీభక్తులకు నరకమన్న భయమెట్లు కలుగును.

శ్లో॥ లఙ్ఘయన్నహర హర్భవదాజ్ఞా
మస్మిహో విధినిషేధమయీం యః
దుర్లభం నతపసాపి గిరైవ
త్వత్ప్రసాద మహ మిచ్ఛ్రరలజ్జః॥ (21-116)

అనగా హేభగవన్! శ్రుతి స్మృతులందు వ్రాయబడివున్న పుణ్యకర్మలు చేయవలెను. పాపకర్మలు చేయరాదు

అనే నీయొక్క ఆజ్ఞలను నిత్యమూ కూడా ఉల్లంఘన చేయుచున్న నేను చాలా నిర్లజ్జుడను. ఎందుచేతననగా- ఋషులు, మునులు, దుష్కరమైన తపముచేత ఏ ఫలమును కోరియుంటిరో దానిని నేను స్తుతిమాత్రముచేతనే ఆయొక్క కృపను అభిలషించుచున్నాను. కవివరుడు లీలాశుకుడు ఇట్లు వ్రాసెను.

శ్లో॥ మాలాబర్హమనోజ్ఞ కుంతలభరాం వన్యప్రసూనోక్షితాం
శైలేయ ద్రవ క్లృప్త చిత్రతిలకాం శశ్వన్మనోహారిణీమ్
లీలా వేణురవామృతైకరసికాం లావణ్యలక్ష్మీమయీం
బాలాం బాలతమాల నీలవపుషం వన్దే పరాం దేవతామ్॥
(కృష్ణకర్ణామృత 3—66)

అనగా కుసుమమాలా మయూర పింఛముచే సుందర అలంకారావళిచేత విభూషిత, వనమాలచే సుసజ్జితమలయజ చన్దనముతో విచిత్రతిలక మస్తకమును ధరించి నిరన్తర దర్శకుల మనస్సులను హరించుచు లీలకొరకు వేణుధరించు సమయమున పరత్వ ప్రేమరసమును సఞ్చారముచేయుచూ తమాలతో సమానసలీకాన్తి కలిగిన, మధురమూర్తి పరతత్త్వము అయిన శ్రీబాలకృష్ణునికి నేను నమస్కారము చేయుచున్నాను. భగవన్మాధుర్యముయొక్క పరిదర్శనముచే పరితృప్తిఅయిన ఒక సహృదయ కవి భావన ఇట్లున్నది.

శ్లో. శ్రుతిమపరే స్మృతి మపరే భారతమపరే భజన్తు భవభీతాః
అహమిహ నన్దం వన్దే యస్యాలిన్దే పరంబ్రహ్మ॥

అనగా విషమసంసారమునుంచి విరక్తులై కొందరు సాధకులు వేదవేదాన్తములను చదువుతే చదువనియ్యి, మరి

కొందరు ధర్మశాస్త్రములను మననచేస్తే చేయనిమ్ము. మరి కొందరు మహాభారత శ్రవణముచేస్తే చేయనిమ్ము. నేనైతే సాక్షాత్తు పరబ్రహ్మ ఎవనియందు క్రీడ సల్పుచున్నదో అట్టి గోపాలకృష్ణునికి నమస్కరించుచున్నాను. గొప్ప కవి, భక్తుడు గోస్వామీ తులసీదాసు తనయొక్క రామచరిత మానస మందిట్లు వ్రాసిరి.

శ్లో॥ యత్పాదప్లవమేకమేవహి భవాంభోధేస్తితీర్షావతాం
వన్దేఽహం తమశేషకారణపరం రామాఖ్యమీశం హరిమ్॥

అనగా ఎవనియొక్క చరణకమలసేవ, సంసారసాగరమును దాటుటకిచ్ఛగలవారలకు సుదృఢమైన ఓడవలెనుండునో, ఏది మహత్త్వము ఆది సమస్తకారణములకంటెను కూడా పైగావున్నదో, నేను ఆ రామనామముగల జగదీశ్వరుడైన శ్రీహరికొరకు నమస్కారము చేయుచున్నాను. పరతత్త్వముయొక్క వర్ణన చేసినమీదట కవిగారియొక్క కలముకు కమనీయతా అధికమవుచున్నది. వానియొక్క అస్తీకరణమునకు శాన్తి దొరుకుచున్నది. మరి ఆవాణికి విశ్రామం.

శ్లో॥ విశ్రామస్థానమేకం కవివర
వచసాం జీవనం సజ్జనానాం।
బీజం ధర్మద్రుమస్య ప్రభవతు
భవతాం భూతయే రామనామ॥

పరబ్రహ్మార్పణమస్తు.

# చతుర్వేదములు.

## స్థానములు.

(1) శ్రవణ శ్రోత్రి ఋక్ కృత హోతా (2) మనస చక్షు యుః, శ్రోత్రా, అధ్వర్య, (3) నిధి, జిహ్వా, సామ, ద్వాపర,, ఉద్గాస (4) ఘ్రాణ, ప్రాణ, అథర్వణ, కలి, బ్రహ్మా- త్రయీ వేదముల చేతను, బ్రహ్మవేదము కిరీటము పూర్ణ్యగావించుచున్నది. శ్రవణ సద్గురూపదేశము బ్రహ్మను ఉపనిషద్బ్రహ్మగా ఉపదేశ మును పొంది హోతాను ధరించి హోతవలెనై తెలియవలెను. అంతట రెండవ వేదమైన యజుర్వేదాధిష్టితమైన స్వయం అధ్వ ర్యుడై అనగా నేత్రిస్వనంచేత సర్వదా శ్రీవణమైనదానిని చూచుచుండవలెను. మఱియు మూడవదియగు జిహ్వేంద్రియ, ధర్మమైన సామవేద ధర్మమగు సామగానభేదోపాయములు గల, ద్వాపరయుగధర్మమైన కృష్ణపరమాత్మయను నిధి ద్వార కుటచేత మూడవవేదధర్మమగు ఉద్గాతుడవుకమ్ము అనగా, జిహ్వాతో సామ గాన ధర్మములు గల వాక్కుచే గట్టిగా బిగ్గరగా ఉద్గానితుడవు కావలెను. అంతట నాలుగవవేదధర్మ మైన, బ్రహ్మ, అనగా నాసికయందు పరమాత్మహంసగల, హింసలేని హంసమార్గము అను జీవము జీవనదివలె సర్వదా ప్రవహించుచున్నది. నాసికయందుండుదానికి నాశనములేనిది అందురు. అందుకనియే నాసికయందలంకరించినది. అధర్వ

వేద ప్రతిపాదితమగు బ్రహ్మ స్వయంగా అన్నిటియందు వుండుచూ మిగత మూడు వేదములచేతనూ కీర్తితుడు, సాంగము చేయుచున్నాడు. బ్రహ్మనాసికయందు తేనియొపల, త్రియీ వేదములచేత కీర్తితుడు పూర్తిఅగునా? పురుషునియం దున్నతుడుగా సర్వదా హంసుడు సంచరించుచునున్నాడు. ఉన్మనియందున్నదే ఉపనిషద్బ్రహ్మ. అదియే అంతటా అన్నిటా వున్నది. గనుక అదియే గీత, గీతాభావము హంస గీతవలె పొడవుగా తెగుతెంపులేక తైలధారావతుగా, అన్ని చోట్ల అన్నివేళల అంతట అన్నిభాగములయందును పూర్ణభావమును పొందియున్నందున ఇదియే బ్రహ్మవేదమందురు. హంసకు తెలిసిన హింస లేదు. హంసను తెలిసిన ఘంసుడుకాడు. అనగా మాయలోపడిపోడు. హంసను తెలిసిన పరమాత్మ హంశగలవాడైపోవును. కలియుగధర్మమైన అధర్వణవేదప్రమాణ్యముగల శాంతి, పుష్టి తుష్టి వృద్ధి మొదలగు సాత్త్వికగుణముగలిగి ఉచ్ఛ్వాస నిశ్వాసములను నీవు విశ్వాసంతో జరిపిన జపించిన సుషుమ్నమార్గము తెరచును. బ్రహ్మనాడి బ్రహ్మవేదము. అదియే బ్రహ్మపదార్థం; అదియే ఆత్మ, ఈమానవత్వములోనే దైవత్వము ఈజీవత్వములోనే ఈశ్వరత్వము. యద్వాచానభ్యుదితం యేనవాగభ్యుద్యతే, తదేవ బ్రహ్మత్వం నేదం ఇదిదముపాసతే. సుగతిని ముందు ఏ ఒక్క హంసవుండుటచేత వాక్కు కలుగుచున్నదో ఏ వాక్కు ఏహంసను వర్ణించి చెప్పలేదో, అదియే బ్రహ్మపదార్థము.

మరియూ, ఏ హంస వుండుటచేత నేత్రములు చూచుచున్నవో, ఏ నేత్రములు ఏ హంసను గాంచలేవో. అదియే బ్రహ్మపదార్థము. ఈ ప్రకారమే సర్వేంద్రియ వ్యాపారము ప్రతిభావమున్నూ జరుగుచున్నది. హంససందేశము. అస్థిపంజరంలో హంసగా అమరివున్నాను, హంసయే మేనులో <u>నేను</u> గావున్నాను. నేను వుంటే సమస్తమువున్నది. నేనులేనియెడల ఏమి యూలేదు.

శ్లో॥ మద్భయాద్వాతి వాతోఽయం
సూర్యస్తపతి మద్భయాత్ ।
వర్షతీంద్రో దహత్యగ్ని
మృత్యుశ్చరతి మద్భయాత్ ॥భాగ॥

భీషాస్మాద్వాతః పవతే...పంచమ ఇతి ॥ఉ॥

నా ఆజ్ఞలేనిదే వాయువు కదలదు. నా ఆజ్ఞలేనిదే సూర్యుడుదయించడు. నా ఆజ్ఞచేతనే ఇంద్రుడు వర్షింపజేయుచున్నాడు. అలాగే సర్వభూతములు నా ఆజ్ఞనే పరిపాలించుచున్నవి. నా ఆజ్ఞవలననే అన్నియూ జరుగుచున్నవి. ఈ మేనులో నేను లేకపోతే, మరేముండును. ఏమియూలేదు. నేనున్నచో సమస్తముండును. ఆజ్ఞాచక్రాబ్జనిలయా, శుక్లవర్ణా షడాననా మజ్జాసంస్థా హంసవతీ, ముఖ్యశక్తి సమన్వితా, హరిద్రాన్నైకరసికా హాకినీ రూపధారిణీ, దీని అర్థమును కొంచము విచారించుము. అహం బ్రహ్మాస్మి అగు మహావాక్యమునుస్మరించి విచారించు తజ్జపస్తదర్థభావనం, సాధనలో సాధనచేత సాధ్యమవుచున్నది, శరీరమునకు పరము హంస; హంసలేనిచో హింసయే

అక్కడనే షుషుమ్నా మార్గము. ఉచ్ఛ్వాస నిశ్వాసలను రెండు తాళములు- నీవద్దనున్నవి. సూర్యనాడి చంద్రనాడులు అను డబుల్ లాక్కుడూప్లి కేట్లునహో నీకివ్వబడియున్నవి. సుషు మ్న మార్గమందు బ్రహ్మనాడియందుగల ఆత్మ దర్బారును చూడకోరితివా? సుషుమ్న తాళమును ఎప్పుడుగునునూ తీయు టకు ప్రయత్నించితివా?

ఆ రెండు తాళములు తీయుట వేయుట అనుమర్మములతో వున్నది. ఏలన సాధారణమయిన యినుపపెట్టెల కే అనేకరక ములుగా తాళములు వేయుట తీయుట మొదట నేర్వని చో తెలియుట కష్టముకదా. అట్టిచో బ్రహ్మవిద్య అందులో బ్రిహ్మనాడి మార్గమయిన సుషుమ్నద్వారమును తెరచుకొని అందుప్రవేశించి నళిననాళములుగల నళినదళాక్షునికన్న పరి పూర్ణుని ఆహ్లాదమును పొందగోరితివా? దైవసమీప్యమును గోరినచో ప్రకృతియగు ప్రపంచకమునిను దూరముగా తొల గించును. అందుచేతనే బ్రహ్మవిద్యకు ఆసిక్యో దృఢిష్టో బలిష్టః కావలసియున్నది. శౌర్య ధైర్య సాహస గాంభీర్య ఉత్సాహాది గుణములతో ముందు "ఓం నమోభగవతే వాసుదేవాయ" (నవ) అను ద్వాదశాక్షరీమహామంత్రముతో చంద్రనాడి అను తాళ నుము 12 అంగుళములు అనగా పన్నెండుపర్యాయములు ఎడమ నుండి కుడికి త్రిప్పవలెను. తర్వాత రెండవ తాళముచెవితో సూర్యనాడి అను తాళముతో "ఓం నమోనారాయణాయ" అను అష్టాక్షరిచేత పఠించుచూ 8 పర్యాయములు 8 అం॥

శములు అనునట్లుగా ఎడమనుండి కుడికి రేచించవలెను. త్రిప్ప వలెను. అంతట కొంతసేపటికి సుషుమ్నా తాళము విడును. ఇవియే గ్రంథులు. అంతట తలుపులు తెరచుకుని చూచుటయే వినోదములు. మాటలులేవు. ఊరక చూచుటయే "అభేదదర్శనం జ్ఞానం" ధ్యానం నిర్విషయం మనః। మాటలులేవు. మనసులేదు. సంకల్పమెక్కడిది. ఇపుడే చేష్టలుడిగి నిశ్చేష్టుడవుట ఈస్థితిని ఒక్కసారి చూరగొనిననాడు నీవు వద్దంటే పోదు. ఇదియే ఉపరతి. ఇడాపింగళులు అను తాళములచేత సుషుమ్నామార్గమును తెరచి బ్రహ్మనాడిని ప్రవేశింపనలంచితివా? అక్కడనే ఒకచిత్రమున్నది. ఆంజనేయస్వామి మొదట లంకలో ప్రవేశించునపుడు లంకద్వారమున లంకిణిని వీరుడై జయించినగాని లంకలో ప్రవేశించలేదు. అలాగే ఇక్కడ బ్రహ్మనాడిని ప్రవేశించునపుడు రసవాదము శ్రీలోలత అను రెండు గెలునశక్యముకాని బలముగల రాక్షసులుంవున్నారు. ఇక్కడ బ్రహ్మచర్యబలము తపోబలము మొదలగు బలాతి బలవిద్యలతోకూడిన సేనను కావలయును. ఇందుకనియే బ్రహ్మవిద్యకు బలమే ప్రధానము. నీవు వీరుడవై పై ఇద్దరురక్కసులను దుర్గోపాసనచేత దుర్లభమయిన రాక్షసులను జయించి ఈదుర్గమందు ప్రవేశించుము. నవద్వారేపురే రమ్యే నవద్వారములవద్దకు నవదుర్గలు కాపలాయున్నవి.

సూర్యచంద్రులుకూడా చొరశక్యముకాని, దుర్లభమయిన యీకోటలోనికి ప్రవేశించదలచితిగాన మంత్రము

లను మరఘిరంగులచే జయించి ప్రవేశించవలెను. అంతట నీవు దుర్గోపాసకుడవు అవుదువు. అందు సిద్ధుడవయి నవదుర్గలతో కాపలాయున్న ఈకోట ప్రవేశింతువు. పూర్వముకూడా ఒక రాజు తనరాజ్యముండగా యితరరాజ్యములు జయించుటకు ఒకవ్యక్తిని ఏదోవిధంగా స్వాధీనపర్చుమనియే ఆరాజ్యమంతయూ గెల్చినది. అలాగే యీకోట ప్రవేశించుటకు హింస లేని మార్గమున్నూ పరమాత్మ హంశగల, ఒక్కహంశ మార్గము మాత్రమున్నది. యీకోట ప్రవేశించినపుడు చేయునది ఏదియూలేదు. అంతయూ చూచునదియే. ఉక్కుస్తంభమునందు ప్రహ్లాదుడు దర్శించిన నరసింహదేవుని దర్శనం నీవు పొందుదువు. అంతట నీవు నరసింహోపాసకుడవు అవుదువు. ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతోముఖం నృసింహం భీషణం భద్రం మృత్యుమృత్యుం నమామ్యహమ్, యీమంత్రముచేత నీవు సిద్ధుడవయి జగత్తును దీవించువాడవైతివి. బ్రహ్మనాడిని సంచరించు ఆత్మను దర్శించినపుడు ఆత్మవేత్త వయినప్పుడు రామోపాసకుడ వగుదువు. రామభద్ర మహేష్వాస రఘువీర నృపోత్తమా! భోదశాస్యాన్త కాస్మాకం రక్షాందేహి శ్రియంచమే॥ యిందు సిద్ధిపొంది లోకమునందు ఆంజనేయులవంటి భక్తుడవయ్యెదవు. ఇన్నివిద్యలతో యిన్ని మర్మములతో యింతశ్రమగల విద్యలన్నియూ, మునులు ఎంతో శ్రమపడి తపస్సుచేత పొందే మహాభాగ్యముతో కూడిన రాజ్యమంతయూ ఈ ఒక్క చిన్న మరతాళములు

ఇడాపింగళులచేత తాళములుతీసి సుషుమ్నమార్గగామిగా అవవలెను. అంతట నీకు కావలసినదంతయూ ప్రకృతిమాతయే సకలము సమకూర్చును. పిల్లిపిల్ల మ్యావు అనిఅన్నంతమాత్రముననే తల్లి గ్రహించి వాటిని మరొకయింటికి మార్చుతున్నది. గాన నీవు మార్జాల కిశోరన్యాయమున పోవుదువో లేక నీవు అనేకజన్మలనుంచి చేసియున్నసుకృతపరిపాకవశాత్తు భక్తుడవయి భగవంతుని భాగ్యమునకు భాగస్వామివి కాదలచినచో సాధనగల సాధకుడవు కమ్ము. ఇదియే మర్కట కిశోరన్యాయము. అనగా సాధకుడవయి వున్నంతకాలమున్ను మర్కట కిశోరన్యాయమునవుండి, అనగా యిడాపింగళులచేత సుషుమ్న తాళము తీసినమీదట నీవు మార్జాల కిశోరన్యాయమున్ను సంప్రాప్తించును. ఒక్కమార్గముననే రెండుప్రాప్తులు అనగా ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం అను అష్టసిద్ధులు ఆవరసను పరసవేదివలె నున్నవి. మొదట మర్కట కిశోరన్యాయమున్ను సాధన పూర్తిఅయిన మీదట అనగా వైరాగ్య భాగ్యప్రాప్తి కలుగును. అథాకామయమానో, యోకామో నిష్కామ ఆప్తకామ, ఆత్మకామో నతస్య ప్రాణావుత్క్రామన్తి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద అనునట్లు ఆప్తకాముడు అగుటయే అనగా మార్జాల కిశోరన్యాయమున సమస్తమున్ను నీవు బాలుడవయి వున్నపుడు తల్లివల్ల నెట్లు పరిపాలింపబడి గారాబముతో పెరిగితివో అటులనే ప్రకృతిమాతవలన తిరిగి యిప్పుడు నీవు పరిపాలింపబడవలెను.

సర్వదా నీయందు వుండికూడా నీకు తెలియని దేవరహస్యము అంతయూ నీకు తెలిసిపోవును. అంతట ఆశ్చర్యవత్ పశ్యతి, ఆశ్చర్యవత్ శృణోతి ఆశ్చర్యవత్ వదతి యీప్రకారమగు పోవును. ఇదియే కర్మమయశరీరమును పాము కుబుసమువిడిచి నట్లు వదలి మంత్రమయశరీరమును ధరించుట నగును. ఇదియే పరకాయ ప్రవేశం. విద్య ఒకశరీరమును ధరించినప్పుడే అదివదలి మరొకశరీరం ప్రవేశించుట పరకాయప్రవేశమనబడునో ఒక్కవిద్యవచ్చినచో సమస్త విద్యలు అనుభవించునో అదియే ఆత్మవిద్య. యజ్జ్ఞానేన సర్వరహస్యం విదితం భవతి. యస్యస్మరణేన సర్వబంధాః ప్రవినశ్యంతి. ఏదినదియో ఒక్క-దేవరహస్యం తెలుసుకొంటే సమస్తం తెలియునో ఇదియే ఆత్మ విద్య నీవు హంసుడవయితే హింసుడవు కావు. అప్పుడే నీవు పరమాత్మ హంసగలవాడ వగుదువు. హంసవ్యాప్తి నాసికాగ్ర వ్యాసప్రోక్త మంతవరకూ వున్నది. సుషుమ్న శాఖము నెరచితివా. నవద్వారే పురేదేహ్యే. యీనవద్వారపట్టణంలోని నవదుర్గలను జయించి నవద్వారములను నవనిధులు సేవించి, నవరత్నములను భక్షణచేయుచూ క్షీరనీరములను, పుణ్యపాప ములను వేరుచేసి మరల నీరములను వదలి పాలను సేవించు హంసవు నీవే అగుదువు. అంతట నీకు హంస పాలను సేవించు నట్లుల నీవు పుణ్యమునకే స్వీకరించుచుందువు. స్వయం తారః పరాంస్తారయతి అనునట్లు నీవు ముక్తుడవగుదువు. నన్ను జేరిన వారి వారి వారి జేరిన వారందరను పాపము లెక్క-

డివి. సమస్తవిద్యలు నిన్నే సేవించును. దుఃఖంబులు నాంఛి తంబులుగాక చేయరుభంగి సర్వాణి శ్రేయాంసి స్వయమేవ యాన్తి అనునట్లు నీవు మనువిద్యోపాసకుడవు. కనుక, సమస్త భూతములు నిన్ను ప్రేమించి సర్వదా నీకు స్వాగతమిచ్చుచుం డును. నీవు చూచిన ఎడల నిముష, నిముషమునకు ఇదే కాదు. ప్రతిఒక్క శ్వాసములోను నీవు దైవముతో కలసి మెలసి వుం దువు. అప్పుడే నీకు స్వాగతము జరుగుచున్నది. ఓతఃప్రోతశ్చ విభుః ప్రజాసు. శ్రుతిమాత ఇట్లు చెప్పుచున్నది. తల్లిచెప్పు నది సత్యము. సత్యం మాతా పితాజ్ఞానం. ఇందుకనియే సద్గు రువును వెదకవలయు ననినది. ఈహంసవిద్య నేర్చుకొనిన పరకాయప్రవేశవిద్య, మనువిద్య ఆత్మవిద్య, బ్రహ్మవిద్య, దహరావిద్య, శాండిల్యవిద్య మొదలగు అనేకవిద్యలు సంప్రా ప్తించును. నీవు అనుభవింపవచ్చు. సమస్తజగత్తుచేత అనుభ వింపజేసి నీవు ఆత్మపురుషుడవయ్యెదవు. దేహము మరలతో కూడిన్నది గనుక మరణము పొందునది ఇల్లు; ఇంటిగలవాడు ఏలాగో ఆలాగే దేహములో దేహి వున్నాడు. దేహి అమరత్వముగలవాడు; ఇది సహజముగా నేయున్నది. గృహం గృహపతిరివ, దేహీ దేహాన్తే పరమాత్మానం ప్రవిశన్తి" ఇదియే నీవు కోరుకొంటానే సమస్తము సమకూరుచుండగా నీవు సంకల్పించేసి, కోటుట ఎంతసేపుగో సంకల్పసిద్ధుడవా సిద్ధ సంకల్పుడవా? హంసలు దేవభాషమాట్లాడును, అమరత్వము గల నీవు వినుటకే అజ్ఞత. హంసవిద్యలోనే హ్రీం శక్తిస్థ

రూపమున్నూ శక్తిత్రికల బీజమున్నున్నది. అందుకనియే మూలాధార స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయములు అను షట్చక్రవర్తి అయి అశేషులకూ ఆజ్ఞాచక్రమును అధిష్ఠించియున్న హంసవిద్యను నేర్చిన సర్వసిద్ధులు సర్వశక్తులు సిద్ధముగాయున్నవి. అంతట సుషుమ్నా ద్వారములు నీవు అనుకున్నంతమాత్రమున తెరువబడి నీకు ప్రవేశము కలుగును. అదర్శ్యాదృక్కు నీవు అలువడిన, నిన్ను జయించు వారులేరు. సర్వకాలములయందు సమస్త చోట్లయందు సమస్త భూతజాలమందు (మౌజూద్) అయియున్నటువంటి హంసవిద్యను తెలియనిదే ఇంకొకటి ఏమి తెలియగలవు. ఈకర్మ శరీరమును వదలి మంత్రమయశరీరమును ధరించుము. మంత్ర సిద్ధుడవు కమ్ము. గురుమంత్రసిద్ధుడవు కమ్ము. అప్పుడు ఈ శవమునందున్న శివుడు ఎవరో తెలియునిమిత్తం మన జగద్గురు శ్రీశ్రీశ్రీ స్వామీ శివానంద సరస్వతీస్వాములవారి వలన తెలియుదము. హంసలన్నిటియందు సిద్ధవారు కనుక, పరమహంసలు వారుగాన వారిసేవచేసి వారినామస్మరణచేసి వారిసేవకనియే యీసమస్తము ప్రశస్తమని దేవభాష హంసలువలన తెలియవలసినదిగాన మహర్షులు వారివద్దనే సంప్రాప్తించును.

సర్వేజనాః సుఖినోభవంతు.

ఓం తత్సద్బ్రహ్మణే నమః.

# పరతత్త్వమీమాంస

శ్లో॥ ఓమహం సచ్చిదానందం ద్వైతాభావోపలక్షితమ్।
శివం ప్రశాంత మమృతం, శుద్ధం బ్రహ్మైవ కేవలమ్॥

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో వంశర్షిభ్యో నమో గురుభ్యో నమో మహద్భ్యః, సర్వోపప్లవరహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి బ్రహ్మైవాహమస్మి.

శివాయ హరయే ధాత్రే వసిష్ఠాయ చ శక్తయే।
పరాశరాయ వ్యాసాయ నమోఽస్తు శుకయోగినే॥
శ్రీగౌడపాదాచార్యాయ మాండూక్యార్థోపదేశినే।
గోవింద భగవత్పాదాచార్యాయ చ నమోనమః॥
సాక్షాచ్ఛివావతార శ్రీశంకరాచార్య మూర్తయే।
గురవే సర్వజగతాం భాష్యకారాయ తే నమః।
శ్రీమద్వివరణాచార్యం శారదాపీఠ వాసినమ్।
సురేశ్వరగురుం వందే పద్మపాదాదికాంస్తథా॥
తచ్ఛిష్య శిష్య శిష్యాది గురుపారంపరీక్రమాత్।
సర్వశాస్త్ర ప్రవక్తారం శివానందగురుం భజే॥

ఓం సహనావవతు, సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై, తేజస్వి నా

వధీతమస్తు, మావిద్విషావహై,

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః.

హరిః ఓమ్.

శ్లో॥ కృతేయత్ ధ్యాయతో విష్ణుం

త్రేతాయాం యజతో మఖైః

ద్వాపరే పరిచర్యాయాం,

కలౌ తద్ధరికీర్తనాత్ ॥

హరేర్నామ హరేర్నామ, హరేర్నామైవ కేవలమ్।

కలౌనాస్త్యేవ, నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా॥

నాల్గుయుగములు నాల్గువేదములు ధర్మంప్రకారం నడుచుటలో కృతయుగమందు మొదటిదైన ఋగ్వేదధర్మమైన ధ్యాన, యోగ, జప తపములు వల్లననూ్నా త్రేతా యుగమందు రెండవదైన యజుర్వేదప్రస్తుత యజ్ఞయాగాది క్రతువులవల్లననూ్నా ద్వాపరయుగమందు; సామవేద ధర్మమైన సామగానలోలుడు శ్రీకృష్ణపరమాత్ముని సహాచర్య పరిచర్యలవల్లననూ్నా కలియుగమందు నాల్గవదైన అధర్వ వేదధర్మమైన నామస్మరణవల్లననూ్నా తరించవలయునుగాని వేరుమార్గమేదియూ లేదనియున్నది. అధర్వణవేద పరిభావము,

యస్త్వాథర్వణాన్ మన్త్రాన్ పఠేచ్ఛ్రద్ధాసమన్వితః।

తేషామ్ అర్థోద్భవం కృత్స్నం ఫలం ప్రాప్నోతిసద్ధ్రువమ్.

మరియు:

శ్లో॥ నతిథిర్నచ నక్షత్రం నగ్రహో నచ చన్ద్రమాః।
అర్థ్వ మస్త సంప్రాప్త్యా సర్వసిద్ధిర్భవిషతి॥

సర్వేషాం అధికారిణా మనధికారిణాం భక్తియోగ ఏవ ప్రశస్యతే, భక్తియోగో నిరుపద్రవః భక్తియోగాన్ముక్తిః, భక్తిసుతా మనాయాసేనా చిరాదేవతత్త్వజ్ఞానం భవతి, తత్కథమితి, భక్తవత్సలస్వయమేవ సర్వేభ్యో మోక్షవిఘ్నేభ్యో భక్తినిష్ఠాన్ సర్వాన్, పరిపాలయతి, సర్వాభీష్టాన్ ప్రయచ్ఛతి మోక్షం దాపయతి చతుర్ముఖాదీనాం సర్వేషామపి వినా విష్ణుభక్త్యాకల్పకోటిభిర్మోక్షోనవిద్యతే, కారణేన వినాకార్యంనోదేతి భక్త్యావినా బ్రహ్మజ్ఞానం కదాపి న జాయతే తస్మాత్త్వమపి సర్వోపాయాన్ పరిత్యజ్యభక్తిమాశ్రయ, భక్తినిష్ఠోభవ భక్త్యాః సర్వసిద్ధయసిద్ధ్యంతి భక్తేరసాధ్యం నకించిదస్తి- శ్రుతిపురాణేతిహాసము చెప్పుచున్నది. గాన ఈ కలియుగమందు సద్గురువును వెదకి ఆశ్రయించి సాధించవలెను. ఏలననగా, భక్తుడైనగాని భగవంతుని భాగ్యమునకు భాగస్వామికాజాలడు, దీనుడుకావలెను. దేయం, దీనజనాయచవిత్తం అని శ్రీశంకరులు శలవిచ్చిరి:—దైవమును, బ్రహ్మవేత్తలు, బ్రహ్మఅందురు. బ్రహ్మయొక్క వైభవము గురుశిష్యసంవాద, రూపముగా వెల్లడికాగలదు.

అన్యవిద్యా పరిజ్ఞాన మవశ్యం నశ్వరం భవేత్।
బ్రహ్మవిద్యాపరిజ్ఞానం, బ్రహ్మప్రాప్తికరం స్థితం॥

ఇతరవిద్యలెప్పుడూ నశించునవే, బ్రహ్మవిద్య బ్రహ్మప్రాప్తి పొందించును.—అట్టిదైవము వేదాంతశాస్త్రమువలన

తెలియనగును, అన్నిశాస్త్రములకంటె పెద్దది వేదాంతశాస్త్రము, అనగా (1) ఉపనిషద్భాష్యము (2) గీతాభాష్యము (3) బ్రహ్మసూత్రభాష్యము. ఇవియే ప్రస్థానత్రయము. వీని వలననే బ్రహ్మవిలాసము తెలియవలెనుగాని వేరుత్రోవలేదు.

గురువు:—ఎవరూ!

శిష్యుడు:—అహం (నేను)

గు:—అక్షరములలో మొదటిదైన 'అ' కారమును అక్షరములలో ఆఖరుదైన 'హ' కారమునుచేర్చి అహం అనుచున్నావు. నీస్థితి చాలా విలక్షణముగా యున్నదే. మేనులో నున్న నేను అనునదేది అని విచారించితివా?

శి:—తెలియదు స్వామీ. అట్టి ఉపనిషద్బ్రహ్మను తెలియచేయుడు.

గు:—అకారము లగాయతు హకారాంతమువరకూ యున్న అక్షరజాలమంతయూ నిన్నుగురించే వర్ణించి చెప్పుచున్నది. సత్యమస్తుః, పితుర్మాతః. ఇదం ద్యావాపృథివీ, పృథివీమాతా ద్యౌః పితా. భూదేవి తల్లియు, అంతరిక్షము తండ్రియు వీరిపుత్రుడవుకనుక పైప్రకారం వాఙ్మయ మంతయూ నిన్నుగురించియే వర్ణించును. అస్తిభాతి ప్రియంనామం రూపం చేత్యంశపంచకం. ఆద్యత్రియం బ్రహ్మరూపం, తతో ద్వయంజగద్రూపం-అనియున్నదిగాన నామరూపములను వేరుచేసి, చూచి విచారించుము. తజ్జపస్తదర్థభావనం అనియున్నది.

ఉత్తమం తత్త్వచింతాచ, మధ్యమం శాస్త్రచింతనమ్।
అధమం మంత్రచింతాచ, తీర్థభ్రాంత్యధమాధమం॥
అందుచేత తత్వచింతన చేయుము.

శి:—సద్గురూ! నాకేమియూ గోచరించుటలేదు.

గు:—అందుకనియే భక్తియోగము చేయమంటిని.

యోగేన యోగో జ్ఞాతవ్యో, యోగోయోగాత్ప్రవర్ధతే।
యోప్రమత్తస్తు యోగేన, సయోగీరమతేచిరమ్॥

యోగసాధనచేత యోగము తెలియబడును. యోగసాధనయే యోగము నభివృద్ధిపరచును. యోగసాధకుడు శీఘ్రముగా యోగసిద్ధిని పొందుచున్నాడు.

శి:—స్వామీ! ఎన్ని సాధనలు చేసినప్పటికి నాకు మనశ్శాన్తి కలుగలేదు. అనుగ్రహించి తెలపీయుడు.

గు:—నాయనా! పూర్వము నీవలెనే నారదులువారు సనత్కుమారుని యీవిషయమే అడిగిరి. ఆవిషయం చెప్పెదను శ్రద్ధగావినుము. ఒక సమయమున నారదులువారు 14లోకములు సంచరించుచూ బ్రహ్మ మానసపుత్రుడున్నూ, తనకు అన్నగారున్నూ అయిన సనత్కుమారులనుసందర్శించి, యీ విధంగా అడిగిరి. స్వామీ! నేను ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము, ఇతిహాసము, పురాణములు, పంచమం వేదానాం వేదము. పిత్ర్యగ్ రాశిం దైవం నిధిం వాకోవాక్య మేకాయనం. దేవవిద్యా, బ్రహ్మవిద్యా, భూతవిద్యా, క్షత్రవిద్యా, నక్షత్రవిద్యా, సర్వదేవ సవిద్యా, ఈ

మొదలైన విద్యలన్నియూ అభ్యసించితిని. కాని నామనస్సునకు శాన్తికలుగలేదు. దయయుంచి యస్యజ్ఞానేన సర్వరహస్యం విదితం భవతి, యస్యశ్రవణేన సర్వబంధాః ప్రవినశ్యంతి తత్స్వరూపమును ఉపదేశింపుము. తరతిశోక మాత్మవిత్ ఆత్మను తెలియునతడు శోకసాగరమును దాటుచున్నాడు అట్టి ఆత్మ అతతీతద్వస్తురూపేణ వ్యాప్నోతీతి ఆత్మా- అని వున్నది గనుక సర్వత్ర ఆత్మను దర్శించవలెను.

సర్వేభద్రాణిపశ్యంతు. మాకశ్చిదుఃఖభాగ్భవేత్, అన్నట్లు, సర్వత్రఆత్మను దర్శించుచు సర్వమునుసుఖముగాను, శాంతిప్రదముగాను; చూచునప్పుడు, నీవు దుఃఖభాజనుడవు కాజాలవు. అహమంటివే, అతడు తిండిపోతు, ఏమన అహం వైశ్వానరోభూత్వా, ప్రాణినాం దేహమాశ్రితాః॥ వైశ్వానరుడు నకు; సర్వదాతిండికావలెను. వ్యాసునిసూత్రం. వైశ్వానరస్సాధారణశబ్దవిశేషాత్ వైశ్వానరుడు సామాన్యపురుషుడు. స్థూలశరీరధారి జాగ్రత్స్థానుడు. తర్వాత సూక్ష్మశరీరధారి, తైజసుడొకడు స్వప్నద్రష్ట, జాగ్రత్స్వప్నములు సమాసములు మూడవవాడు కారణశరీరధారి, సుషుప్త్యవస్థ, ప్రాజ్ఞుడు (స్వప్న, నిద్రాలంబనంవా, పతంజలిసూత్రం జ్ఞానం) త్రిషుధామసుయద్భోజ్యం భోక్తాయశ్చ ప్రకీర్తితః, వేదైతదుభయం యస్తు, సభుజ్జానో నలిప్యతే॥ మూడుధామములయందు మూడునామములతో, మూడుశరీరములతో అనుభవించునదంత యూ యీమేనుయందు నేను అనునతడునీవే, సామవేదము

తత్త్వమసి, అతసినే నీవు తెలియవలసినది. అతసినే నీవు వెదకవలసియున్నది.. మూలాధార, స్వాధిష్టాన, మణిపూరక అనాహత, విశుద్ధ, ఆజ్ఞా సహస్రారములను, సప్తచక్రముల యందు, ఉచ్ఛ్వాస, నిశ్వాసములుగా, విశ్వాసముచేత జరుగు చున్న సూత్రాత్మను ఆశ్రయించవలెను, ఏలనన. ఆజ్ఞాచక్రాబ్జనిలయా, శుక్లవర్ణా షడానన మజ్జాసంస్థా హంసవతి ముఖ్య శక్తిసమన్వితా హరిద్రాన్నైకరసికా, హాకినీరూపధారిణీ అగుటచేత ముఖ్యశక్తియుతమైన హంసమార్గమును తెలియవలెను. నాసి కాయాం సదాశివః, హంసను తెల్సినతర్వాత హింసలేదు. శివంలేనియెడల శవమేనిది. హంస హంసాయ విద్మహే పరమహంసాయ ధీమహి, తన్నో హంస ప్రచోదయాత్ హంస హంసేతియో బ్రూయాత్ హంసోనామ సదాశివః, ఉపనిషద్ వాక్యము, హంసమార్గమును తెలిసినతర్వాతనే హంసగుణముగు ఇదిమంచి ఇదిచెడ్డ ఇదిపుణ్యము ఇది పాపము ఇది సుఖము ఇది దుఃఖము ఇది నీరు ఇవిపాలు అను ధర్మము తెలిసిచె దుమార్గమును వదలి మంచిమార్గమును అనుసరించును. అధిష్టానం జీవా ఊచుర్నవచక్రప్రవేశమనుబ్రూహీతి; స ధేతి సహోవాచ ఆధారేబ్రహ్మచక్రం త్రిరావృత్తి భగమండలాకారం తత్రమూలకందేశక్తిః పావకాకారంధ్యాయేత్తత్రైవ కామరూపపీఠం సర్వకామఫలప్రదం భవతి.ఇత్యాధారచక్రం ద్వితీయం స్వాధిష్టానచక్రం షడ్దళం తన్మధ్యే పశ్చిమాభిముఖం లింగం ప్రవాళాంకురసదృశం ధ్యాయేత్తత్రైవ

ఓడ్యాణపీఠం. జగదాకర్షణసిద్ధిదం భవతి. తృతీయం నాభిచక్రం పంచావర్తం సర్వకుటిలాకారం తన్మధ్యే కుండలినీం బాలార్క-కోటిప్రభాం తనుమధ్యాం ధ్యాయేత్ సామర్థ్యశక్తిస్సర్వసిద్ధిప్రదా భవతి, మణిపూరకచక్రం హృదయచక్రమష్టదళమధోముఖం తన్మధ్యే జ్యోతిర్మయలింగాకారం ధ్యాయేత్ సైవ హంసకళా సర్వప్రియా సర్వలోకవశ్యకరీ భవతి. కంఠచక్రం చతురంగులం. తత్ర వామే ఇడా చంద్రనాడీ దక్షిణే పింగళా సూర్యనాడి తన్మధ్యే సుషుమ్నాం శ్వేతవర్ణాం ధ్యాయేత్. ఇంతవరకూ ఎవరు తెల్సుకొందురో (య ఏవం వేద) సోఽనాహతసిద్ధిదా భవతి తాలుచక్రం తత్రామృతధారా ప్రవాహః ఘంటికాలింగం మూలచక్రరంధ్రే రాజదంతావలంబినీవివరం దశమద్వారం తత్రశూన్యం ధ్యాయేచ్చిత్తలయం భవతి. సప్తమం భ్రూచక్రమంగుష్ఠమాత్రం తత్రజ్ఞాననేత్రం దీపశిఖాకారం ధ్యాయేత్ తదేవ కపాలకందం వాక్సిద్ధిదం భవతి. ఆజ్ఞాచక్రమష్టమం బ్రహ్మరంధ్రం నిర్వాణచక్రం తత్ర సూచికాగృహేతరం ధూమ్రశిఖాకారం ధ్యాయేత్. తత్ర జాలంధరపీఠం మోక్షప్రదం భవతి, ఇతి పరబ్రహ్మచక్రం. నవమమాకాశచక్రం.

తత్ర షోడశదళపద్మ మూర్ధ్వముఖం తన్మధ్యకర్ణికా త్రికూటాకారం తన్మధ్యే ఊర్ధ్వశక్తిం తాం పశ్యన్ ధ్యాయేత్తత్రైవ పూర్ణగిరిపీఠం, సర్వేచ్ఛాసిద్ధిసాధనం భవతి - అని ఉపనిషద్వాక్యము. దీనినే శ్రీప్రహ్లాదులు సర్వాతీతను నిధానముగంటె నేనని యుబ్బగంతులువైచు నొక్కచోట. నదు

రువు నాశ్రయించి హంసరహస్యమును తెల్సుకొని అన్నిపనుల యందు అన్నివేళలందు దైవచింతనయందు వున్నవాడగు చున్నాడు. ఈసూత్రార్థమే కృష్ణభగవానులు చెప్పినగీత. ఇట్టిగీతనే మునులు ఉపనిషద్బ్రహ్మగా నుపాసించిరి. ఇట్టి ఉపనిషద్బ్రహ్మనే శ్రీవ్యాసులు బ్రహ్మసూత్రములు అని శలవిచ్చి యున్నారు. ఈహంససూత్రమున సమస్తజీవులు మణులవలె గుచ్ఛబడియున్నందున బ్రహ్మసూత్రమనిరి. బ్రహ్మవిద్య ఎంతకష్టమో బ్రహ్మసూత్రమును తెలిసినయెడల అంతసులభమున్నూ అంతసులువైనదిన్నీ అగుచున్నది. మానవుని యందు దేవత్వమున్నది. అనగా అనిమిషత్వమున్నదని తులసీదాసుగారన్నారు. మానవుడు మీనము (చేప) వంటివాడని జాగ్రత్తయందు చూచుచున్నాడు. స్వప్నమును కల్పించు చున్నాడు, సుషుప్తి పొందుచూ చూచుచున్నాడు. మూడు స్థానములందు చూచుచునేయున్నాడు. కన్ను మూసినదెప్పుడు సంసారమును సాగరమువలె పోల్చినప్పుడు అందున్నవాడు మీనమువంటివాడు గనుక ఈసంసారమందు ఈదుచున్నాడు, ఈశరీరమందున్న అహమనునది ఒకవ్యాఘ్రము. దానిని ఇడా పింగలా అను జోడుగుళ్ళబారునఓం నమోనారాయణాయ అను అష్టాక్షరి ఓం నమోభగవతే వాసుదేవాయ అను ద్వాదశాక్షరి అను గుండ్లతో వెతకి వేధించి వేటాడవలెను. అప్పుడు అహంభావము నశించి సోహంభావము ఉదయించును. ఆనాటినుంచిన్నీ నీవు అన్నిసమయములందు అన్ని

చోట్లయందు అన్నిటియందు విలక్షణముగా గాన్పింతువు. అప్పుడు నీపరధ్యానము దృఢపడును, నీవుని కియు, ఆహారవిహారాదులు, మాటలు, పనులు అన్నియూ చూచువారలకు విలక్షణముగా తోచును, అప్పుడు నీవుప్రపంచకమును స్వప్నవతుగా చూచెదవు" పశ్యంతి స్వప్నవల్లోకం చతుర్థీం భూమికాంగతాః। అని శృతిమాత చెప్పుచున్నది-స్వప్నమును ఆలంబనచేయుము- స్వప్నజాగరణములు సమానములు. అప్పుడు త్యాగశీలత పొందుదువు- త్యాగశీలురకే భోగపరాయణత అనగానిద్రాసమాధిస్థితిః,అంతటజాగ్రతనుస్వప్నము చేతనున్నూ నిద్రాసమాధిస్థితిః నిద్రను సమాధిచేతనుజయింతువు. ఇట్టిసమయముననే భోగపరాయణత్వమందుదు, అష్టాక్షరిమంత్రము జపించవలయును అష్టకష్టములను. జయించవచ్చును. అష్టసిద్ధులు పొందవలెను; అష్టఐశ్వర్యములు అనుభవించవలెను-నాయనా! ఎడమ ముక్కున చంద్రనాడిద్వారా పన్నెండు అంగుళముల శ్వాసముతో పన్నెండుమాత్రలుగా ఓం నమో భగవతే వాసుదేవాయ అనుద్వాదశాక్షరిచే పూరకంచేసి భ్రూమధ్యబ్రహ్మనాడి షుషుమ్నను చూచుచు కుడిముక్కున సూర్యనాడి ఎనిమిది అంగుళముల శ్వాసముతో ఎనిమిది మాత్రలుగా ఓం నమోనారాయణాయ అనుఅష్టాక్షరీమంత్ర రాజముతో రేచించి యిదేవిధంగా సాధ్యమైనంత సేపున్నూ సాధ్యమైనంత మంత్రరాజ జపమున్నూ చేయుచు మండలం 40 రోజులు చేసినచో సేవించినచో ఇకనీవెన్నడూ ఈ అభ్యా

సను మానవు. రోజురోజు క్రొత్తక్రొత్త దైవసంపత్తి అనుభవించుచూ రాయల్ ఫామిలీ వాడవయిపోవుదువు. అట్టిరీతిగా దేవునివాడవైనపుడు నీకు కావలసినదేదియు కొదువవుండదు. అందరూ నీయందుందురు. నీవందరియందుండువాడవవుదువు. అభేదదర్శనం జ్ఞానం,ధ్యానం నిర్విషయం మనః.రోజు ఒక్కంటికి నడుచుచున్న 21600 ఇర్వై ఒక్క-వెయ్యి ఆరువందల శ్వాసములలోను పైప్రకారం అష్టాక్షరీ మహామంత్రరాజమును ఎన్నిపర్యాయములు చేయగలవో చూచుకొనుము. ఇట్టి భక్తుడు నిజాభ్యాసమార్గమున ముక్తినొందును. స్వయంతారః పరాంతారయతి అనునట్లు ఈఒక్కడు 27 తరముల పితరులను తరింపచేయు దైవబలము గలిగియుండును. బాల్యమందు తలిదండ్రుల ఋణమునుతీర్చి యౌవనమందు భార్యాపుత్రాదుల ఋణముతీర్చి, కౌమారమందు మునిఋణమునుతీర్చి, వార్ధక్యమున సన్యాస, స్వారాజ్య పట్టాభిషిక్తుడు కావలెను. (స్వారాజ్యమధిగచ్ఛతి) జీవుడెట్టివాడు. వానిస్వభావమెట్టిది? జీవుడు భ్రాంతిమయుడు, భ్రాంతులుడిగిన బ్రహ్మంబు బట్టబయలు అనునట్లు జీవుని అన్వేషించునది. యీవిషయమే భవానీశంకరుల నడిగినది. జీవుడు దేవుడైసవిధ ముపదేశింపుమని తుషాబుద్దే వ్రీహిస్యాత్తుషాభావేన తండులః। ఊకపాయలచే కప్పబడి వున్నపుడు, ధాన్యపుగింజ అనియు, ఊకపాయలును తప్పించినచో బియ్యపుగింజఅనియూ చెప్పుదురు. ఆలాగునే ఏవంబద్ధస్సదాజీవః, కర్మనాసే సదాశివః॥ స్కాంధ। పు॥ భ్రాంతి అన్న

బంధముచే జీవుడనియూ, బంధవిముక్తుడు ఈశ్వరభావమనియు చెప్పుచున్నది. ఇదియే రజ్జు సర్పభ్రాంతిఅనియూ చెప్పుదురు. చీకటిలో త్రాడునుచూచి సర్పమని భ్రమించినప్పుడు ఇరుగు పొరుగువారు దీపముతెచ్చి నాయనా పాముకాదు, త్రాడు. ఇదిగోచూడుము అని తెలియచెప్పినప్పుడు ఏలాగో అటులనే సద్గురూపదేశమును పొందినమీదట సర్పభ్రాంతియూ, జీవ భ్రాంతియూ నశించును. అప్పుడు పదార్థతత్త్వ నిస్సంశయ కారుడవై సుఖము నొందుదువు. బయలుచూడ చూడ బంధ నంబె; లోను చూడచూడ లోకాభిరామంబు అనునట్లు శ్రుతి మాతకూడ భిద్యతే హృదయగ్రంధిచ్ఛిద్యంతే సర్వసంశయాః క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే. విశాల మైన హృదయమునువిప్పి విజ్ఞానవీధిని విహరించినచో సర్వ శక్తియుతమైన ఆత్మను తెలియును. వత్సా! ఆత్మవిషయము ఆశ్చర్యమయము. ఆశ్చర్యవత్పశ్యతి. ఆశ్చర్యవత్ వదతి, ఆశ్చర్యవచ్ఛృణోతి. ఆత్మవిషయము ఆశ్చర్యముగా చూచును; ఆశ్చర్యముగా చెప్పును, ఆశ్చర్యముగా వినును. ఎందుకనగా! క్షణక్షణము నూతనవిషయములే గోచరించును. (సమాధి వాక్యములు) వైరాగ్యచింతకును గారణంబు సంగములుగల్గి యు సంగికాడు. భోగములం జెందియు భోగిగాడు. కార్యములు సర్వమును జేసియు కర్తగాడు, విగతసంకల్పుండు బ్రహ్మవేత్త యధిపా! బ్రహ్మ, ఆత్మ అన్నియుగల్గి ఏమియూ అంటకుండా యుండును. ఆత్మను తెల్సినతర్వాత పుణ్యపాపములు అంటవు

అథాకామయమానో, యోకామో, నిష్కామ, ఆప్తకామ, ఆత్మకామో నతస్యప్రాణా ఉత్క్రామంతి, బ్రహ్మైవసన్; బ్రహ్మాప్యేతి బృ॥ ఉ॥ నిష్కాముడు అయినపిమ్మట ఆప్తకాముడు కావలెను. తర్వాత ఆత్మకాముడు అగును. అంతట అతనికి పుణ్యపాపములు అంటవు. అంతట గృహం గృహపతి రివ దేహీదేహాన్తే పరమాత్మానం ప్రవిశతి. గృహపతి గృహమును పొందునట్లు దేహీ దేహాంతమందు పరమాత్మను పొందుచున్నాడు. హా॥ ఉ॥ ఆత్మవిద్యయే పరకాయప్రవేశవిద్య, తచ్ఛృష్ట్వా తదేవాను ప్రావిశతు॥ ఉ॥ వాక్యం తనుసృష్టించుకుని అనగా గృహనిర్మాణం చేసుకొని గృహయజమానుడు గృహప్రవేశము చునట్లు ఆత్మసృష్టించుకొని అందు ప్రవేశించియున్నది. ఆత్మ మొదట గోచీలేక, బాల్యశరీరముధరించి, తల్లిప్రక్కను పరుండివుండి తర్వాత యౌవనశరీరం ధరించి భార్యప్రక్కను పరుండివుండి తర్వాత కౌపీనధారణచేసి కానసం చొచ్చి ఆశ్రమసివాసంలో కౌమారశరీరం ధరించి ముని రుణం తీర్చుటకొరకు భక్తి జ్ఞాన వైరాగ్యములు ధరించి తపోవృత్తియందువుండి తర్వాత ముసలి శరీరం ధరించి ముక్తికాంత సమాగమం చేయుచున్నాడు. శరీరం అనగా కాయము. ఒక శరీరమునకు మరొకశరీరం పరకాయమందురు. ఏశ్వరంలో వున్నపుడు ఆశరీరం ధర్మములు పనులు ఆహారవిహారాదులు అన్నియూ ఒకదానికొకటి విలక్షణముగానే యుండును; మరియూ స్థూలశరీరమందున్నపుడు వుండేపనులు వ్యవహార

ములకున్నూ సూక్ష్మశరీరం ధరించి తైజసుడను పేరుతో స్వప్నమునువీక్షించుట మొదలగు పనులకున్నూ ఒకశరీరమునకు మరొకశరీరమునకు వుండులక్షణములకున్నూ పరకాయమందురు. మరియూ జాగ్రత్స్వప్నములుకాని, కేవలం సుషుప్తియందు ప్రాజ్ఞతతో కారణశరీరి అయివుండునపుడున్నూ తిరుగ జాగ్రత్తుకు వచ్చినపుడు స్థూలశరీరి వైశ్వానర పేరుతో వ్యవహారింపబడుచూ యీవిధంగా మూడుశరీరములు మూడునామములతో ఒకకాయమునుంచి మరొకకాయమునకుచేరుట నిత్యసిద్ధమయియే యుండివున్నది. సద్గురువునాశ్రయించి యీరహస్యం విశదంగా వినవగును. ఈఅభ్యాసము బాగుగా తెలిసిన మీాదట ఇతరుల శరీరంలోకూడా సుఖంగాను సులువుగాను ప్రవేశించగలరు. ఆత్మనిద్య అభ్యాసకుడు ఆత్మానాత్మకు యీ మార్గమందు వున్నపుడు మునులు, యోగులు, ఋషులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు మొదలైనవారందరూవచ్చి దర్శించి దర్శనమిచ్చి సంభాషించి, దీవించి, ఆశీర్వదించి, అనుగ్రహించి వచ్చి పోవుచుందురు. అంతట యోగమునందు అంతకంతకు ఉత్సాహము ఎక్కువగుచూ యోగసిద్ధినిపొంది ఆత్మానుగ్రహమును అందును. అపుడు నీవు పరుసవేది వంటి వాడవగుదువు. నీతో సంభాషణ, దర్శన, స్పర్శములు జగత్తును అనిఖవిధములచేత తృప్తిపర్చును. భక్తుడునదివంటివాడు: భగవానుడు సముద్రుడంటివాడు. పథికుడుసముద్రు నివద్దకువెళ్ళి ఒడకొట్టివున్నతరి గుక్కెడు నీరు త్రాగుటకైననూ శక్యము

కాదు. ఆలాగున దైవమువలన నీకు ప్రత్యక్షముగా అట్టిఫలితమే కల్గును. కాని సముద్రునివలననే నదులుత్పుట్టుచున్నవి. తిర్గి సముద్రుని చేరుచున్నవి. యీలోగా నదులు భూమియందు ప్రవహించి; సమస్త సస్యానుకూలము సమస్తజీవులు స్నానపానీయములకు సర్వవిధముల పునీతంచేసి తృప్తిపర్చి తిరిగి దైవమయినసముద్రునిపొందుచున్నవి. భక్తుడు దర్శన స్పర్శన భాషణములచేత సమస్తజగత్తును; పవిత్రతచేసి దైవమును పొందుచూ జగత్తును పొందజేయుచున్నాడు. భక్తుడు దైవము యొక్క ఆదేశములనన్నిటిని జగత్తునకు వెల్లడిచేసి సేవజేయు ప్రతినిధి జగత్తుకు దైవమునకు మధ్యవర్తి; అట్టియెడ ఆత్మవిద్యోపాసనచేత ఆశిష్ఠో దృఢిష్ఠో బలిష్ఠః అనునట్లు స్థితప్రజ్ఞ కలిగి అనేకములైన ఆత్మలను అజ్ఞానముతొలగజేసి పవిత్రులనుగాజేసి ముక్తులనుచేయగలిగిన బలశాలివై శాపాదపి శరాదపి అనునట్లు నిగ్రహానుగ్రహసమర్థుడవు అగుదువు అపుడు నీకు కావలసినదేదియూయుండదు. అన్నిటియందు నీవున్నట్లు చూచెదవు. అహంతా మమతాలు ఎక్కడుండును అపుడే సర్వాణి శ్రేయాంసి. స్వయమేవయాంతి అనగా సమస్త శ్రేయస్సులు నిన్నువరించునట్లు నీవద్దకొచ్చి నిన్ను పొందుచున్నవి.

యదార్థమైన పరమార్థమెట్లున్నదన విను- ఉదయమున బట్టబయట పశ్చిమాభిముఖు యుండుము. నీలోనుంచి నీవలెనుండు నీఛాయనునీవుచూచి దానినిపట్టవలెనని పరుగిడి.

తివి. ఎంత ప్రియత్నించినను నీకుసాధ్యపడలేదు. విసిగి వేసారితివి నీలో వున్నది; నీవు కావలెనన్న నీకు లభ్యపడలేదు. నీవు దుః ఖింపుచూ పరుగిడుచునేయున్న సమయమునకు దైనము దీన జనపరిపాలకుడుగనుక నీయందు వాత్సల్యముకలిగి శ్రీమన్నా యణమూర్తి సద్గురురూపమున నీకెదురగును నాయనా ఆగు మాగుము. నీవెక్కడికింత ఆతురతతోను ఆశతోను అలసి సొలసి దుఃఖించుచు పరుగిడుచుంటివి. చెప్పుము. అని యడుగగా స్వామీ నాలోనిదే నాకు పట్టుబడకుండాయున్నది. అం దుకని యింతగా పరుగెత్తుచుంటినని చెప్పెను. నాయనా! నామాటవినుము. నీవు ఎంతయో శ్రమపడి విశ్వప్రయత్నము చేసినను నీకుసాధ్యపడనిదానిని ఇప్పుడు నామాటవిందువా! నీవువద్దు అన్నప్పటికి నిన్నువదలనిగా పోయిచుంటిని చూడు ము. అని చెప్పి తిన్నగాతూర్పునకు తిరుగుము. సూర్యభగవా నునికి మనసా నమస్కరించి యీసారి సూర్యోదయమగుచున్నది గాన ఆదిక్కుగా రథమును మరల్చి నడుపుము. అంతేటు ఒక్క సారి నామాట వినుచుకొరకు ఒకసారి వెనుకకు తిరిగిచూడ దవు. అంతటనీవు నీకూడా వచ్చినన్నను నిన్ను వెన్నంటిపోయియుం డును. అపుడునీవు యథార్థమైన పరమార్థమును చూచెదవు. ఎదురుగా పూర్వదిక్కున సద్గురూపదిష్టమైన ఉపనిషద్బ్రహ్మ సూర్యభగవానుని తేజస్సుచేత ప్రకాశమానంలో అన్నియూ గోచరించును. ఇక నీకు తెలియనిదేదియులేదు. అన్నిటియం దు నీవు ప్రకాసింతువు; నీయందన్నియు ప్రకాసించును. అ

ప్పుడు మరొకసారి తిరిగివచ్చితివి. చీకటిగాయున్నది. చీకటిలో చీకటిగా (నల్లగా) వున్న దానికొరకు ప్రయత్నం. సాధ్యపడలేదు. సద్గురువు అనుగ్రహించుటచేత సాధ్యపడినది. చీకటి అజ్ఞానము అజ్ఞానములో తిరుగుచు పరుగుడుచున్న నీకు సూర్యనమస్కారమను పూర్వదిక్కునకు త్రిప్పి జ్ఞానబోధ చేయుటచేత నా కార్యసిద్ధిని పొందితివి. పరుగుడుసాధనమువకు తిరుగుడుమంత్రమిదియే- అనగా ఉపనిషద్బ్రహ్మ అయిన ఇడాపింగళులచేత ఉచ్ఛ్వాస నిశ్వాసములుగా తిరుగుచూయున్న నిత్యజీవనదిగాయున్న హంసమార్గముతక్క మరొకటి లేదు— మరొకటికాదు- అంతట ఇడాపింగళ్ళులను డబుల్ లాక్ అనునట్లు సుషుమ్న మార్గము గేటు తాళము తీయుటకుగాను వున్నవి- ఒక తాళంచెవితో వేయుట ఒకదానితో తాళము తీయుట అను రెండునాడులచేతనూ చేయవలెను. అంతట నళిననాళము అను (తామరతూడువలెవుండు) సుషుమ్నయొక్క తలుపులు తెరచి నళినాక్షుడను బ్రహ్మనాడియు అందుండు పరమాత్మయు దర్శనమిచ్చును. అప్పుడు నీకు ఆహ్లాదము కలుగును. అప్పుడు నీవు ప్రహ్లాదునివంటి భక్తుడవగుదువు. గురూ ఆత్మవిద్యలో స ఏకో బ్రహ్మణ ఆనన్దః - బ్ర॥ వల్లి॥ అప్పుడు సర్వసిద్ధులు నిన్నే వరించును. ఇట్లు తర్జనభర్జన చేయు అర్జునునికి దేవతలందరూ సంతసించి ఆదరించి దీవించి వారి వారి ఆయుధములన్నియూ బహుమతిగా యిచ్చిరి. ఆవిధముగానే నీసత్సంకల్పముయొక్క బలముచేత, నీకు సర్వ

సిద్ధులు మూర్తివంతములు ధరించి నీవుపాస్య దేవతలేనీకు సమస్తముచేకూర్చి నీకు సేవచేయును. సర్వాసిద్ధయః సిధ్యంతి. దుఃఖంబులు వాంఛితంబులుగాక చేకురుభంగి సర్వాణి శ్రేయాంసి స్వయమేవయాంతి అయమాత్మాబ్రహ్మ- అధర్వణ వేద మహావాక్యమయిన ఈ ఆత్మపదార్థము యదార్థము షుషుమ్నానాడీ బ్రహ్మఉన్నానిని దర్శించి మనస్సందు తన్మయ మందుట దైవసన్నానమందుటందురు. అట్టిదైవసంపత్తిని క్షణ క్షణముపొందు మహాభాగ్యము; దైవకటాక్షము కలిగినప్పు డు సద్గురూపదిష్టశ్రివణమైనతర్వాత సాధనప్రిపంచకములో పడి; శ్రివణ, మనన ఇత్యాది ప్రవాహములోపడినవానికి తీవ్రసంవేగానామాసన్న అను పతంజలిసూత్రమున్నది చూ చారా! చెర్వులోవున్న చేప ఏకారణమువనో ఒకబారెడు దూరమున ఒడ్డుమీదపడినది. అంతట ఆచేప తిరిగి నీటిలో చేరుకొనుటకు ఎంత తొందరపడునో నీఆత్మనిదర్శనకు అంత వేగిరపడుము.

హరిః ఓమ్ తత్సత్.



శ్రీనివాసప్రెస్, రాజమండ్రి.

ప్రాప్తిస్థానము:-

శ్రీ స్వామి నారాయణానంద సరస్వతి మహరాజ్

నాగసింహాశ్రమము

కోరుకొండ (రాజమండ్రి తాలూకా)

(తూ. గో. జిల్లా.)